శ్రీరస్తు

పాలకురికి

# సోమనాథదేవప్రభుఁడు

రచయిత:

నేలటూరు వెంకటరమణయ్య.



చెన్నపురి:

రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్

'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము

1955

 [*Price Rs.* 1-0-0

శ్రీ ర స్తు

బాలకులకి

# సోమనాథు డెవ్వఁడినాఁడు

రచయిత:

నేలటూరు వేంకటరమణయ్య.



చెన్నపురి:

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్

వారి 'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.

1955

# తొలిమాట

ఆధునిక ఆంధ్రవాఙ్మయవిమర్శకు లనేకులుజేసిన పాల్కురికి సోమనాథుని కాలనిర్ణయము సరికాదను తలంపు చిరకాలమునుండియు నా మనస్సునందు నెలకొనియుండినది. ఇటీవలి ప్రచురణలలో బ్రతిపాదితములైన సిద్ధాంతములు కొన్ని చరిత్రాంశములకు బ్రత్యక్షము విరుద్ధముగ గన్పించుటవలన నందలి సత్యాసత్యములను పరిశీలించి కనుగొనవలయునను కుతూహలముగల్గినది; ఇదియె ప్రస్తుత వ్యాసరచనకు గారణము. ఓపికతో దీనిని సాంతముగ జదివిచూచి యందందు జేయదగిన సవరణలను సూచించినందులకు మిత్రులు శ్రీమల్లంపల్లి సోమశేఖరశర్మగారికి అంజలి గావించుచున్నాడను. ముద్రించి ప్రకటింప వెరవెఱుఁగక తికమకపడుచుండ భాషాపోషకులును, సహజౌదార్యసంపన్నులును నగు భాషోద్ధారక శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారు నాకు జేయూతయిచ్చి యేతత్కార్యమును నిర్వహించినందుకు వారికి కృతజ్ఞతాపూర్వక నమస్కారములను సమర్పించుచున్నాడను. ముద్రణకార్యమును మెలకువతో సత్వరముగ సాగించిన వావిళ్ల ముద్రణశాలాధికారవర్గమునకు వందనము సేయుచున్నాడను.

హేమకూటము
౧౦ రామన్ వీధి,
త్యాగరాయనగరు, మద్రాసు.
౧-౨-౫౫

నేలటూరు వేంకటరమణయ్య.

ఈ పుస్తకము దొరకు స్థలము:—

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,

292, నేతాజీ సుభాష్‌చంద్రభోస్‌రోడ్, చెన్నపురి. 1.

లేక

490, తిరువత్తియూరు హైరోడ్, తండియార్పేట,

మదరాసు.—21.

# పాలకురికి సోమనాథుఁ డెప్పటివాఁడు?

ప్రకరణము ౧.

ఆంధ్రకవుల చరిత్రలో నేటిదనుక పరిష్కారము గాక వాద ప్రతివాదములకు దానకమైన సమస్యలలో పాలకురికి సోమనాథుని జీవన కాలవిషయము ముఖ్యమైనది. పేరెక్కిన పరిశోధకులెల్ల సోమనాథుని కాలనిర్ణయచర్చలో పాల్గొని యున్నారు. కాని యిప్పటి వఱకు నిశ్చయమేర్పడలేదు. సోమనాథుని జీవనకాలమును నిశ్చయింపదలపెట్టిన పరిశోధకులను రెండుతెగలుగ విభజింపవచ్చును. పాల్కురికి సోమనాథుఁడు క్రీ. శ. ౧౨ వ శతాబ్దోత్తరార్ధమున జన్మించి ౧౩ వ శతాబ్ద పూర్వార్ధము నందనఁగా క్రీ. శ. ౧౨౩౦-౪౦ ల మధ్య మృతినందెనని చెప్పువారు కొందఱు; ౧౩ వ శతాబ్దాపరార్ధమున బుట్టి ౧౪ వ శతాబ్ద పూర్వార్ధమున దాదాపు ౧౩౩౦ వఱకును జీవించెనని తలంచువారు మఱికొందఱు. ఈ విషయమునకు సంబంధించిన సాక్ష్యము నంతటిని బరామర్శించి వాస్తవముగ సోమనాథుని జీవనకాలమెద్దియో కనుగొనుటకు వీలగునేమో చూతము.

ఈ సందర్భమున మొదట పరిశీలింపదగినది సోమనాథుని గ్రంథములయొక్క సాక్ష్యము. అతని రచనలలోనెల్ల ముఖ్యమైనవి బసవపురాణ పండితారాధ్యచరిత్రలు. ఇందు మధ్య

యుగమున వర్ధిల్లిన ఇద్దఱు గొప్పమతసంస్కర్తల జీవనచరిత్రలు వర్ణింపబడినవి. బసవపురాణమున క్రీ. శ. ౧౧౫౭-౧౧౬౭ ల మధ్య కల్యాణకటక సింహాసనమునాక్రమించి చాళుక్యసామ్రాజ్యమును పాలించిన కాలచుర్య వంశజుడయిన బిజ్జలునిప్రధానియగు బండారుబసవన్న చరిత్రమభివర్ణితమైనది. పండితారాధ్యచరిత్రమున బసవదండనాయకుని సమకాలికుఁడైన మల్లికార్జున పండితారాధ్యుని జీవనచరిత్ర కీర్తింపఁబడినది. కావున నీయిరువురు మతసంస్కర్తల జీవనచరిత్రలనురచించిన పాల్కురికిసోమన వీరికి సమకాలికుడో తరువాతివాడో కావలయును. ఈ యంశము నావల విపులముగ విచారింతము. పై రెండు గ్రంథములలోను పాల్కురికి సోమనాథుడు దన సమకాలికులను గొందరిని పేర్కొనుటయే కాక మల్లికార్జున పండితారాధ్యుల సంతానమును బ్రస్తుతించియున్నాడు. బసవపురాణ పీఠిక యందు త్రిపురాంతకమున గరస్థలి సోమనాథయ్యగారు, మల్లినాథుఁడు, రెంటాల మల్లినాథుఁడు, దోచమాంబ, నారయాంకుఁడు, గోడగి త్రిపురారి మున్నగుభక్తులు గోష్ఠిజేసియుండఁగా దానువారలకు నమస్కరించి బసవపురాణముజెప్ప నిష్టమయ్యెడిని, కథాసూత్రంబు వెరవెఱింగించి కృతార్థునిజేయుఁడని వేడుకొంటిననియు నందు పై వారు, "బసవపురాణంబు బసరించు శక్తి ససలారనొసఁగితిమి. ఇఁక భక్తహితార్థముగా బసవపురాణమును రచియింపు" మని చెప్పిరనియు సోమనాథుఁడు వచించియున్నాడు. పై బేర్కొనిన భక్తులలో గరస్థలి సోమనాథుఁడు త్రిపురాంతక వాస్తవ్యుఁడు, పండితారాధ్య కృపాసముద్ర

తుఁడు. రెంటాల మల్లినాథుఁడు సీమాలంఘన వ్రతమువలన ప్రఖ్యాతుఁడై కుమారాద్రియనఁగా త్రిపురాంతకమునకు దూర్పుదెస సోపానములు దీర్చెను. దోచాంబ ప్రత్యహము నైదు కరవీరపుష్పములు శివున కర్పించెడిది. ఒక్కనాఁడందు కొక్కటి తక్కువ కాఁగాఁ దననేత్రకమలమర్పించి భవునిచే ననదృశాంబకమప్పుడె పడిసి ధ్రువ కీర్తి నందినది. మఱియు నీ బసవపురాణ శ్రోత కర్ణాటక మండలి గొబ్బూరగ్రహార విభుఁడైన సంగనామాత్యుఁడు. ఇతఁడు గొబ్బూరి మాదన్న శిష్యుఁడు. జంగమ భక్తుఁడు. సోమనాథుని కనుకూలంబు; కావున నతని బసవపురాణమునకు శ్రోతగ వరించెను. తనయుదంతమును గూడ సోమనాథుడు సంగ్రహముగ దెల్పుకొనెను: తాను విష్ణు రామిదేవ శ్రియాదేవుల పుత్త్రుఁడననియు గట్టకూరి పోతిదేవర పదాంబుజ షట్పదుఁడననియు, గరస్థలి విశ్వనాథ ప్రకట వర ప్రసాద కవిత్వయుతుఁడననియు, వడగాము రామేశుని శిష్యుడగు చెన్నరాముని ప్రాణసఖుఁడననియుఁ జెప్పుకొనెను. గ్రంథాంతమునందు:—

"గొబ్బూరి మాదన్న కూరిమి శిష్య
గొబ్బూరి సంగసద్గుణ సముత్తుంగ
ఇదియసంఖ్యాతమాహేశ్వర దివ్య
పదపద్మ సౌరభ భ్రమరాయమాణ
జంగమలింగ ప్రసాదోపయోగ
సంగతసుఖ సుధాశరధినిమగ్న
సుకృతాత్మ పాలుకురికి సోమనాథ
సుకవి ప్రణీతమై శోభిల్లి తనరి

చరలింగ ఘన కరస్థలి విశ్వనాథ
వరకృపాంచిత కవిత్వ స్ఫూర్తిఁ బేర్చి
చను బసవ పురాణమను కథ యందు
ననుపమంబుగ సప్తమాశ్వాసమయ్యె,[1]

నను ద్విపదలలో గ్రంథకర్తను గవిత్వవిద్యాగురువును మరల ప్రస్తుతించెను. పండితారాధ్యచరిత్రవలన మఱికొన్ని విషయములు దెలియవచ్చుచున్నవి. గ్రంథారంభమున,

పేరెక్కఁదగిన శ్రీ బెలిదేవి వేమ
నారాధ్యులను పరమారాధ్య దేవు
మను మని శిష్యుండ......"

నని చెప్పుకొన్నాడు. ఆపస్తంబ సూత్రహారితసగోత్ర పవిత్రుఁడును, వీరమాహేశ్వర విశ్రుతాచార్య కారుణ్య హస్తాబ్జ భవుఁడును, గడు మించి శివునకు గన్నులర్పించి పడసిన దృఢ వీర భక్తవర్ధనుఁడునునగు పాల్కురికి సూరనామాత్యుని శ్రోతగా నెన్నుకొనెను. ఏలనఁగా నతఁడు సోమనాథుని బంధుఁడు, మిత్రుఁడు, సాహిత్య విచక్షణుఁడు.

"బసవేశుఁడక్కిన భక్తుండవనియు
సదృశ లీల మాకనుగులంబనియు
మచ్చిక నా ముద్దు మఱఁది వీ వనియు
నెచ్చెలికాడవు నీవు కాకనియు

1. బసవపురాణము (ప్రభాకరశాస్త్రిగారిచే పరిష్కరింపఁబడినది.) పుట ౨౪౬. ఈవ్యాసమునందు సర్వత్ర యీముద్రణమె యుపయోగింపఁబడినది.

జాతుర్య సాహిత్య శాలిపీవనియు
శ్రోత్రుత్వమునకు బాత్రుండ వీ వనియు

. . .　　　. . .　　　. . .

దీవించి నిన్ను సంభావించి శ్రోతఁ
గావింతు సచివాగ్రగణ్య సూరార్య. [1].

యని కారణమును దెల్పినాడు. గ్రంథాంతమున పండితా రాధ్యుని లింగైక్యానంతరము జరిగిన వృత్తాంతము నిట్లు వివరించి యున్నాఁడు.

"అంతలోనన బండితారాధ్యునాత్మ
సంతతియును గులసతి సమేతముగ
లింగోదరమునందు లీనమైరట్లు

. . .　　　. . .　　　. . .

భువన పావనుని యపూర్వతనూజా
దరిత సంసారు గేదారయ్య పుణ్య
భరితులోకారాధ్య పట్టంబు గట్టి
ప్రస్తుత శంభుడౌ పండితారాధ్య
హస్తాగ్రజుండు దోనయ్యయు భక్త
వర్గంబు గొనియాడ వసుధ దద్గురుఁడ
నర్గళ భక్తి రాజ్యము సేయు చుండె.
నంత గేదారయ్య యాత్మ సంతాన
సంతతియును శైవ సంతాన సంత
తియు భువనారాధ్య తేజో విభాతి

1. పుట. ౮.

భావన లోకముల్ పరమ పావనము,
గావింప మఱియట్లు గాక తదీయ్య
కేదార దేశికు గీత చరిత్రు
గాదిలి సుత చతుష్కము జెప్ప నొప్పు
మనుమ పండితుఁడు భీమన పండితయ్య
యును మహాదేవయ్యయును జెన్న విభుడు
ననఁగ గురుచతుష్కమాత్మ సంతాన
తనయపరంపరోత్తర పరంపరలు

... ... ...

సముదిత మహిమ దచ్ఛైవసంతాన
విమలాంబునిధిమధ్య విభ్రమానర్ఘ్య
నాయకరత్నంబునాలోకగురు స
మాయత ప్రీతి నొప్పా రివటూరి
సోమనాథయ్య విశ్రుత వీరభక్తి
భూమాభిరామ విస్ఫురణ వెలుంగ
వారి పుత్రులు భక్తి వర్ధన పరులు
సూరీశ్వరుండు లోకారాధ్య పదవి
హారుండు విశ్వనాథప్పయ్యగారు
గారుణ్య నిధులు సింగణమంచిగారు
ననఁగ గురు త్రితయాన్వయ తనయ
తనయ పరంపరోత్తర పరంపరలు
ప్రభుతరగురు పరంపర తేజరిల్లె." [2].

---

2. పండితారాధ్య చరిత్ర—ఆంధ్రగ్రంథమాల. ౩౦—రెండవ భాగము—పుటలు ౧౪౯—౧౫౦.

సోమనాథుని సమకాలికులలో దోచాంబ, రెంటాల మల్లినాథుల విషయముదప్ప మఱి యెవ్వరినిగూర్చియు నేమియు దెలియరాదు. వీరి విషయముగూడ వివాదగ్రస్త మగుటవలన నది కాలనిర్ణయమునకంతగ దోడ్పడదు. కాని బసవపురాణ పండితారాధ్యచరిత్రల వలన సోమనాథుఁడు బసవనికిగాని మల్లికార్జున పండితారాధ్యునికిగాని సమకాలికుడుగాడనియు వారికంటె గడు నర్వాచీనుఁడనియుఁ దెల్ల మగుచున్నది. అతఁడు స్వయము బసవన నెఱుఁగడు. కరస్థలి సోమనాథుఁడు మున్నగు భక్తవరుల నడిగి తెలిసికొని వారు చెప్పిన యద్భుతగాథలను గ్రంథస్థము జేసి బసవమాహాత్మ్య మును బ్రకటించినాడు. మఱియు పై నుదాహరింపఁబడిన మల్లికార్జున పండితారాధ్యుని సంతానముయొక్కయు వారి పుత్రుఁడగు కేదారయ్య శిష్యసంతానముయొక్కయు వృత్తాంతమును బరిశీలించి 'చూడఁగా సోమనాథుఁడు మల్లికార్జున పండితారాధ్యుల కైదాఱు తరములు వెనుకనుండినట్లు తోఁచుచున్నది. చూడుడు:



"అనఁగగురుచతుష్కమాత్ర సంతాన - తనయపరంపరోత్తర పరంపరలు" అని చెప్పియుండుటవలన మల్లికార్జున పండితారాధ్యుల మనుమల యనంతరము గనీసము రెండు పురుషాంతరములైనను గడచియుండవలయునని దృఢముగ బల్కవచ్చును. ఇంతియ కాదు, కేదారయ్యగారి శిష్యబృందములో నాయకమణివంటివాడు ఇవటూరు సోమనాథయ్య. అతని సంతానము:—




"అనఁగగురు త్రితయాన్వయ తనయ-తనయపరంపరోత్తర పరంపరలు." అనియుండుటవలన సూరీశ్వరాదులయనంతరము గనీసము రెండుపురుషాంతరములైన గడచెననుట నిశ్చయము. పూర్వోక్తచరణములను యథాతథమర్థము జేసికొనక యతిశయోక్తులని వ్రాసి పుచ్చినను పండితారాధ్యుల కత డైదు తరములు దరువాతి వాఁడగును. పండితుని పుత్ర పౌత్రులవి రెండును నివటూరి సోమనాథునియొక్కయు నతని పుత్ర పౌత్రాదులయొక్కయు తరములు మూడును మొత్తము

మీద నైదుతరములు గడచి యుండవలయును. కావున మల్లికార్జునపండితారాధ్యుల కాలమును గనుగొనగల్గితిమేని పాలకురికి సోమనాథుని కాలమును స్థూలముగ నిర్ణయింపవచ్చును.

## ప్రకరణము ౨

### మల్లికార్జున పండితారాధ్యుల కాలము

మల్లికార్జున పండితారాధ్యులెప్పుడు వర్ధిల్లిరో విచారింతము. శివతత్త్వసారమను మతగ్రంథమును మల్లికార్జున పండితారాధ్యులు విరచించియున్నను దన్మూలమున వారిజీవన కాలమును నిర్ణయించుటకు వీలు లేదు. కాని యతనికాలమున వెలసినరాజులు మున్నగు చారిత్రకపురుషులు గొందఱును నప్పుడు నడచిన చరిత్రాంశములుగొన్నియు బండితారాధ్య చరిత్రయందు వర్ణింప బడియుండుటచేత వాని యాధారమున నాతని కాలమును నిర్ణయించుటకు వలనుపడుచున్నది.

౧. మల్లికార్జున పండితులకాలమున వెలనాటిరాజులు చందవోలు రాజధానిగ తీరాంధ్రదేశమును బాలించుచుండిరి. ఆతఁడు మతప్రచారముకొఱకు బయలువెడలి చందవోలునకు జేరినప్పుడచట వెలనాటి చోడుడను రాజు రాజ్యముసేయుచుండెను. రాజసభయందు నానాసమయముల గురువులకును వాదము జరిగినది. ఈ సందర్భమున రాజగురువగు బౌద్ధగురువు పండితుని దిరస్కరించెను. మఱియు నంతకుపూర్వము

బలిమి వట్రిల్లగా గొలని శ్రీ చెన్న
మల్లికార్జును దీపమూలెగంబంబు
... ... ...

వ్రచ్చి తెప్పించిన వాడట వీని
జెచ్చెర చంపక చిక్కితి మేని
యూహింపనాతఁడు ద్రోహియే మనము
ద్రోహులమును నభక్తులముగా కనుచు

రేవయ దేవయ యను భక్తులా మరుసటి వేకువజామున బయలువెడలి సముద్రముదాటి యద్దరినుండు బుద్ధాలయమును జేరి బౌద్ధగురుని వధించి మరలి వచ్చిరి. వెలనాటి చోడున కీసంగతి తెలియవచ్చినది. అంతట చోడుఁడు మల్లికార్జునుని బిలిపించి "నీవు బౌద్ధగురుని చంపించితివా?" యని యడిగెను. మల్లికార్జునుడు దానే చంపించితి నని యొప్పుకొని, "నీవు నన్ను శిక్షింప నెంచుచున్నాడవు. నేను శిక్షనంద సిద్ధముగనున్నాడను. అత్తీదండమ చాలుఁననవలదు, శిరము ముమ్మాఱుగా ఛేదింప శిరములు మొలవక చిక్కెనేనియును, గరములు ముమ్మాఱుగాదునిమింప గరము లంకురితములుగాకుండెనేవియును, గాయంబు ముమ్మాఱుగా నఱకింప గాయమెప్పటియట్ల ఘటియిల్లదేనియును, బౌద్ధులే ఘనులు, వారిపథమే దర్శనము, బుద్ధుడె దైవము, నీవె పతివి" అని పల్కెను. లింగోద్భవదేవు గోపురసమంచితాభ్రంకష హర్మ్యాంగణమున గొప్పసభ కూడినది. అంతట పండితుఁడు చోడుని వంకముఖమై "ఇక నాలస్యమేల కన్నుల బీకింపుము. ముమ్మాఱు కన్నులవచ్చెనా కడమసూతండని చెప్పెను. రాజాజ్ఞయైనది. కాని భయభ్రాంతుఁడై తలవరిపాఱిపోగా బండితుఁడే మల్లినాథదేవుని స్తోత్రముజేసి స్వయముగ గన్నులను బెకలించివైచెను. కాని శివుని మాహాత్మ్యమువలన మరల కన్నులు

వచ్చినవి. మరల నతఁడు గన్నులను బీకివైచెను. కాని మరల వచ్చినవి. చోడునికి గోపమతిశయించెను. ఇక మూఁడవ పర్యాయ మతఁడు స్వకింకరులచేత పండితునికన్నులను బెరికించి "జిల్ల పాల్దెప్పించి నిండబోయించి" వెడలిపోయెను. అప్పుడు పండితుఁడు హరభక్తులు వినగా "నింక మీరు నాకు కన్నుల నిచ్చుట మహిష్ఠతగాదు. ఆ పెనుద్రోహిఁ ద్రుంచునంతకు నాతని నతని వంశంబు నంతకు పురమునకనుచు నంతవఱకు నాకు కన్నులనిచ్చిన నీకు భక్తులయాన, కన్నుల నాసించిన నాకును భక్తుల యానయే యని పల్కి, యీయసంఖ్యాత మహేశ్వరోద్ధిత సమాయాత క్రోధోత్కటానల పటల విరచిత జ్వాలల వెలనాటిచోడ ధరణీతలేశ్వరాధమ పతంగంబు భస్మమయ్యెడును, తద్బంధులు సుతులు విస్మయంబుగ నిపుడె భస్మమైపోదురని శపించి యమరారామమునకు బోయెను.

అంత చందవోలున వెలనాటి చోడునికి వ్రణము పుట్టెను. ఎన్ని చికిత్సలు జేసినను మానలేదు. బాధ దుర్భర మాయెను. అప్పుడతనికి పండితుని కరుణవడసినగాని వ్రణము మానదని తోచినది. మంత్రులను నాప్తులను నతని బ్రార్థింపఁ బంచెను. కాని చోడుని ననుగ్రహింపకాతడు నిరాకరించెను. అమరేశ్వరునిపై నొకయష్టకము జెప్పి కీర్తించెను. అంతట నదీ మధ్యమున భక్తుల నొడ్డోలగముగా నునిచి "వెడలితి మటుగాన వెలనాటిసీమఁ బడయుదునింక నంబకములీక్షణమ" యని పల్కెను. పండితారాధ్యుల కూర్ధ్వలోచనములు గల్గెను. అంతట పురాతనభక్తులచరిత్రముల గీర్తింపుచు భక్తులతో శివానందలీలల నలరియాడుచును, శంకరగీతముల బాడు

చును, శంకరలీల జతులకాడుచును బరమశివానంద భరితుండై యుండఁగా మున్ను కర్ణాటభాషనర్థించి బసవనికడ కంపిన జంగమును భక్తులును మరలి వచ్చి బసవని హస్తానుగత విభూతి నతని కొసఁగిరి. దాని గైకొన్నంతటనె కర్ణాటభాష సాంగముగ వచ్చెను. కర్ణాట గీత సంగతులు బాడఁగల్గెను. [3]

౨. వెలనాటిసీమను విడిచి పండితారాధ్యులు పానుగంటిరాజ్యమును బ్రవేశించెను. ఊరూరఁదిరుగుచు సద్భక్తలచే సన్మానములబొందుచు పానుగంటికి బోయి చేరెను. బండరువు గోవింద ప్రెగ్గడమున్నగు శిష్యులాతని నెదుర్కొని స్వాగతమిచ్చి తోడ్కొనిపోయిరి. అప్పుడు పానుగంటిని ఉదయావనీశుఁడను రాజు పరిపాలించుచుండెను. అతని లెంకలలో ధవశేశ నామయ్య యనునతఁడు ముఖ్యుడు. అతడు శివ భక్తుఁడు. అతఁడు సహజైకలింగనిష్ఠావృత్తిని నడచుచుండగా దోడి లెంక లదిగని యోర్వక రాజుతో "కొంకక పెట్టించుకొనియు మీ తమ్మ బౌఅంగవైచుదా భక్తుండనుచు" నని యతనిపై కొండెములు జెప్పిరి. రాజతనిని బిలిపించి తన సముఖముననే తమ్మ దినమని యాజ్ఞాపింపగా నతడు నిరాకరించెను. తన్ను రాజు దండించకముందే బసవనిమహిమను రాజుకు దెలియ

---

3. పండితారాధ్యచరిత్ర.-ఆంధ్రగ్రంథమాలిక. 3౦ — రెండవ భాగము, మహిమ ప్రకరణము. పుటలు 3-౧౭౬. కీ శే. డాక్టరు చిలుకూరి నారాయణరావుగారు, (నిషు) గుడుముల అనేగ్రామము చేరి, వీరచాకి దేవయ్యచేత ప్రణిపత్తి చేయించుకొని అక్కడఉండగా బసవేశ్వరుడతనికి విభూతి పంపినాడు. దానివల్ల అతనికి కర్ణాటకభాష వచ్చినది" అనివ్రాసినారు.—చూ. పీఠిక. పుటలు. ౭౬-౭౭—ఇది పొరపాటు.

జెప్పి తన తలను తానే యుత్తరించుకొని కైలాసమున కేగెను. ఈ వృత్తాంతము పండితారాధ్యులకు దెలియవచ్చెను. కోపో ద్రిక్తుడై యతఁ డుదయావనీశుడు పుత్రకళత్ర మిత్ర బంధు వులతోగూడ నిప్పుడె త్రుంగెడుగాక యని శపించెను. శాపోత్థత విలయోగ్ర వహ్నికి ఉదయావనీశుఁడాహుతి యయ్యెను. [4].

3. తరువాత పండితారాధ్యులు వనిపురమునకుబోయి యచట శంకరయ్యయను భక్తునియింటనుండఁగా, నొక్క అయ్య వచ్చి

కల్యాణమున భక్తి గజిబిజి వుట్టి
బల్లహుబిజ్జలు భంజించిరంత
బల్లిదుల్ జగదేవ మొల్లె బ్రహ్మాయులు
నేగి కప్పడి సంగమేశ్వరంబునకుఁ
దాగోరి బసవనదండ నాయకుఁడు
నిచ్చమై నాసంగమేశు గర్భంబుఁ
జొచ్చె దేహముతోనె చోద్యమొప్పార
నిదియుఁదా నేటికి నెనిమిది దినము
లది నిక్కమనుచు......"

చెప్పెను. [5]. ఆ వార్తవిని పండితుఁడు మిక్కిలియు బ్రలా పించి యచటినుండి శ్రీశైలమునకు దరలిపోయెను.

---

4. పండితారాధ్యచరిత్ర -ఆంధ్రగ్రంథమాలిక. 3౦—రెం. భాగము. పుటలు. ౧౭౯—౧౯౯.

5. పండితరాధ్యచరిత్ర.—ఆంధ్రగ్రంథమాల. 3౦—రెం. భా. పు. ౧౯౦-౧౯౯.

పై నుదాహరింపబడిన విషయములనుబట్టి చూడఁగా మల్లికార్జున పండితారాధ్యులు వెలనాటి చోడునకును, పానుగంటి యుదయావనీశునకును, కల్యాణకటకాధిపుడైన కాలచుర్య బిజ్జలుని ప్రధానియైనబసవనికిని సమకాలికుడని తెలియుచున్నది. ఈ ముప్వురు నెప్పుడు వర్ధిల్లిరో కనుగొంటిమేని పండితారాధ్యుల కాలము నిర్ణయము కాగలదు. ౬.

## ౪. వెలనాటి చోడఁడు

క్రీ. శ. ౧౨ వ శతాబ్దమున తీరాంధ్రదేశము చతుర్థకులజులైన వెలనాటి రాజులపాలనక్రిందనుండినది. వీరు స్వతంత్రులుగారు; చాళుక్య చోళచక్రవర్తులకు సామంతులు. రాజభక్తిపేర్మిని కులోత్తుంగచోడ, రాజేంద్రచోడాది చాళుక్య చోళచక్రవర్తుల నామములను వీరు ధరించువారు, తత్కారణమున వీరు వెలనాటి చోడులునా బరగిరి.వీరి రాజధాని ఇప్పటి గుంటూరుజిల్లా తెనాలితాలూకాలోని చందవోలు. ఈ వంశమున, లక్ష్మణరావుగారన్నట్లు, చోడనామధారు లిద్దరు కలరు. మొదటి వెలనాటి చోడడు క్రీ. శ. ౧౧౧౫ మొదలు ౧౧౩౬ వఱకును రాజ్యమేలెను. ఇతని మనుమడు రెండవ వెలనాటి చోడడు, ఇతనిని వెలనాటి రాజేంద్రచోడడని చెప్పుటయు

౬. ఈ యంశములను బ్రథమమున శ్రీ కే. వి. లక్ష్మణరావు పంతుల వారు విపులముగ జర్చించిరి.—శివతత్వసార పీఠిక. పుటలు ౧౬-౨౫—. తరువాతి వారు లక్ష్మణరావుగారినే యనుసరించిరి. కాని లక్ష్మణరావుగారి చర్చ కూలంకషమైనది కాదు. ముఖ్యాంశములు కొన్ని వారి దృక్పథమున కెక్క లేదు.

గలదు. ఇతఁడు క్రీ. శ. ౧౧౬౩ మొదలు ౧౧౮౦ వఱకును రాజ్యపాలన మొనర్చెను.[7]. ఈ యిరువురిలో బిజ్జలునకును బసవనకును సమకాలికుడు రెండవ వెలనాటి చోడఁడే. కావున మల్లికార్జున పండితారాధ్యులు చందవోలునకు విచ్చేసిన దతని రాజ్య కాలముననై యుండవలయును. మఱియు బండితా రాధ్యులశాపమువలన వెలనాటి చోడఁడు మృతినందినపిమ్మట వెలనాటి రాజ్యమునందంతఃకలహములు జెలరేగి తన్మూలమున నది నాశమందెను.

"ననుచునంతకు పురికరిగె జోడండు
నంత రాజ్యార్థమెయని బోరి యతని
సంతానమెల్ల నిస్సంతాన మయ్యె
బాడయ్యె దద్భూమి పండిత విభుని
యీడిత శాపమహిమ్మత జేసి.

శాపమహిమవలన ప్రణబాధితుఁడై చోడఁడు మృతి నందెనని పండితారాధ్యచరిత్రయందున్నను, నిజముగ శిష్యుల మూలమున పండితుఁడతని జంపించెనని సంశయించుటకవకాశము లేక పోలేదు. చందవోలునుండి యమరావతికిబోయి యమరేశ్వరు నమరేశ్వరాష్టకముచే గీర్తించి కృష్ణానదిమధ్యమున నొడ్డోలగ మేర్పఱిచి భక్తులకి ట్లుపన్యసించెను.

'అది దక్షిణార్థ మానరపతి భూమి
యిది యుత్తరార్థ మీనరపతి భూమి

---

7. ఇతని కడపటి శాసనము శకాబ్దము ౧౧౦౨-వ సంవత్సరమున క్రీ. శ. ౧౧౮౦-వ్రాయించినది. ద్రాక్షారామభీమేశ్వరాలయమున గలదు (ARE. 4I3 of 1893, SII. IV. I335)-

వెడలితిమటుగాన వెలనాటి సీమ
బడయుదు మింక నంబకము లీ క్షణము
యట్టిదకాదె మాయాది ప్రతిజ్ఞ
యట్టును గాక వాడంతకుఁగూడు
నంతకు బడయమేమన్నా రమట్ల
యంతకు గూడు వాడింతకు ననుచు.

ఇట్లు మల్లికార్జున పండితారాధ్యులు జెప్పుచుండఁగనె

"యంతలోనన ఫణిహారి యాద్రోహి
నంతకు ప్రోలికి ననిపి యేతించి
నలి భక్తతతికి విన్నపమాచరింప"

నాతఁడలరెనట. ఈ ఫణిహారి యెవ్వడు? చోడని ఫణిహారియు కావలయును. వ్రణబాధితుఁడై చోడడు మృతినందుట వాస్తమైనచో ఫణిహారి యా ద్రోహినంతక పురికనుచుట పొసగియుండదు; చంపుట వాస్తవమైనచో వ్రణబాధచే జచ్చుటవాస్తవమై యుండదు. చోడని యంతక పురికంపి వచ్చితినని ఫణిహారి పండితారాధ్యులకును భక్తతతికిని విన్నవించుకొనుటచూడఁగా నతఁడు పండితారాధ్యుల శిష్యవర్గము లోనివాడనియు రేవయ దేవయలు గుర్వాజ్ఞమీదనో లేకయో బౌద్ధగురుని హింసించి చంపినట్లు అతఁడును వెలనాటి చోడని హత్యచేసి చంపెనని తోచుచున్నది.

వ్రణబాధవలన నైననేమి హంతకుని కత్తికెరయైన నేమి వెలనాటి చోడడు క్రీ. శ. ౧౧౮౦ వ సంవత్సరమున మృతినందినది నిశ్చయము. ఏలనగా నతని శాసనములటు వెనుక గానరావు. వెలనాటిరాజుల యధికారమటుపిమ్మట

నడుగంటినది. వెలనాటి చోడునికి గొంకడను పుత్త్రుడుండెను. ఇతఁడు తండ్రియనంతరము రాజ్యముజేసెనా లేదా యనుట సందిగ్ధాంశము. చోడుని వెనుక నతనిమనుమఁడైన పృథ్వీశ్వరుఁడు రాజ్యమేలినట్లు శాసనములు దెల్పుచున్నవి. కాని యతని యధికారము కళింగమందుదప్ప మఱియెచ్చటను జెల్లుబడి కాలేదు. తీరాంధ్రదేశమునందెచ్చటను నతని శాసనములు గానరావు. క్రీ. శ. ౧౧౮౫ న నతఁడు రాజ్యము ప్రారంభించు నప్పటికే తీరాంధ్రదేశమునందు వెలనాటి రాజులయధికారము గూలిపోయెనని దృఢముగ బల్కవచ్చును. కావున పండితారాధ్యులచే శప్తుడై మృతినందినవాఁడు రెండవ వెలనాటి చోడుఁడగుట నిశ్చయము. అగునేని పండితారాధ్యులు చందవోలు నకు బోయినది క్రీ. శ. ౧౧౮౦ సంవత్సరమునందు కావలయును. పండితారాధ్యులమరామముచెంత కృష్ణానదీమధ్యము నందొడ్డోలగము గూర్చినదియు నాసంవత్సరమునందే కావలయును.

### (చ.) ఉదయాదిత్యవనీశుఁడు.

పానుగల్లను పేరుగల పట్టణము లాంధ్రదేశమున రెండు గలవు. రెండును నేటి హైదరాబాదు రాజ్యమునందున్నవి. ఒకటి నల్గొండజిల్లాలోనిది, మఱియొకటి మహబూబ్ నగరు జిల్లాలోనిది. మహబూబ్ నగరు జిల్లాలోని పానుగల్లే పండితారాధ్యచరిత్రయందు బేర్కొనబడిన ప్రదేశమని శ్రీలక్ష్మణరావు గారు గుర్తించియున్నారు. పండితారాధ్యచరిత్రనుబట్టిచూడఁగ నది నల్గొండలోని పానుగల్లగునేమో యను సందియము గల్గు చున్నది. లక్ష్మణరావుగారు ఉదయాదిత్యవనీశుఁడు చోళుఁడని

చెప్పిరి. ఇది సరియె. చోళవంశీకుల శాసనములు నల్గొండ-పానుగల్లునందును గానవచ్చుచున్నవి. వీరిశాసనములు గాన వచ్చుస్థలములను బట్టిచూడ వీరియేలుబడి వరంగలుజిల్లా దక్షిణ ప్రాంతము వఱకును వ్యాపించియుండినట్లు తోఁచుచున్నది. ఇచ్చట మొదట పేర్కొనదగినది శకాబ్దము ౧౦౪౬ క్రోధి—క్రీ. శ. ౧౧౨౪, సంవత్సరమున నిల్పిన పానుగల్లుశాసనము.[1] ఇందీ క్రిందివంశావళి వర్ణింపబడియున్నది.

......ర్వరాజ్ఞు మరాజు

భార్య—బెడగాంబ.

|

కుమార్తె మైలాంబిక.

భర్త. తొండ నృపుడు.

| | |
|---|---|
| ఉదయాదిత్యుఁడు. | భీముఁడు. | గోకర్ణుఁడు. |

పైజెప్పిన మైలాంబిక భర్తయగు తొండనృపుడు చోడ వంశజుఁడనియు నేలువపాలకుడనియు శకాబ్దము ౧౦౪౩ నకు సరియైన చా. విక్రమశకము ౪౬—క్రీ. శ. ౧౧౨౧ న, మైలమ దాక్షారామమున వ్రాయించిన శాసనమందలి "కోడూర్పురవరే శ్వర సూర్యవంశోద్భవకులతిలక కాశ్యపగోత్ర కరికాలాన్వయ నామాది సమస్త ప్రశస్తి సహితం శ్రీమన్మహామండలేశ్వర వేలువ తొండయ రాజుల మహాదేవి మయిలమదేవులు"[2] అను వాక్యమువలన దెలియవచ్చుచున్నది. మఱియు నీతొండరాజు

1. తెలిం. శాస. ఇతర నెం. ౧౮ దు. 2. SII, IV, 1216.

తండ్రిపేరు భీముఁడని పానుగల్లునందే కానవచ్చు మఱియొక శాసనమునందలి "శ్రీమద్భీమరాజనందన స్తొండతిలకీతిశోభి" యను మాటలవల్ల విదితమగుచున్నది.[1] మఱియు శకాబ్దము ౧౦౮౪ చిత్రభాను పౌష్య బ ౨ మంగళవారముననిల్పిన యొక జడచర్లశిలాశాసనమునం దొక కందూరోదయ చోడమహారాజు రాజ్యము సేయుచుండినట్లు చెప్పియున్నది.[2] పై శకాబ్దమునకు సరియైన చిత్రభానువర్షమునందే మాఘ. శు. ౧3 శనివారమునాడు వ్రాయించిన కాకతి రుద్రదేవుని యనుమకొండ శాసనమున గందూరోదయ చోడుఁడును భీమగోకర్ణులును పేర్కొనబడియున్నారు.[3] భీమగోకర్ణు లన్నదమ్ములని యా శాసనమునందున్నను, ఉదయచోడనికిని వారికి నెట్టిసంబంధము గలదో తెలియవచ్చుటలేదు. ఒకవేళ నతఁడును భీమగోకర్ణులతోఁబుట్టువై యుండవచ్చును. శకాబ్దము ౧౦౬౭ క్రోధి యప్పటి పానుగంటిశాసనమందు పేర్కొనబడిన తొండనృపమైలాంబికానందనులైన ఉదయాదిత్య భీమగోకర్ణులు వీరే కావచ్చును. జడ్చర్ల హనుమకొండ శాసనములలో పేర్కొనబడియుండు ఉదయాదిత్యుఁడే పండితారాధ్యులు పానుగంటికి బోయినప్పుడు అచట రాజ్యముసేయుచుండిన యుదయావనీశ్వరుడని శ్రీలక్ష్మణరావుగారు గుర్తించినారు.[4] తరువాతి వాఙ్మయచరిత్రకారులు వారిసిద్ధాంతమునే గ్రహించిరి, కాని

1. తెలిం. శాస. ఇతర నెం. ౫ రు.
2. తెలిం. శాస. ఇతరనెం. ౬ రు.
3. వేయిస్థంభాలగుడిశాసనము. శ్లో. ౧౭-౨౧, ౨౬-౨౯.
4 శివతత్వసారము, పీఠిక, పుటలు ౧౪-౧౯.

యిది సంగతముగాదు. ఏలనఁగా శకాబ్దము ౧౦౮౪ చిత్రభాను మాఘ బ ౧౩—క్రీ. శ. ౧౧౬౩ జనవరి ౧౯-నాడు రుద్రదేవుడనుమకొండయందు శాసనము వ్రాయించునప్పటికే యుదయాదిత్య గోకర్ణులు మృతినందిరని యందు స్పష్టముగ జెప్పబడియున్నది. పండితారాధ్యచరిత్రను బట్టిచూడఁగా మల్లికార్జునుఁడు వెలనాటి చోడని మరణానంతరము పానుగంటికి బోయినట్లు తెలియుచున్నది. శాసనసాక్ష్యమును బరిశీలించిచూడగా నీవెలనాటి నాటిచోడడు క్రీ. శ. ౧౧౮౦ పర్యంతము రాజ్యము సేయుచుండెనని రుజువగుచున్నది. కావున జడచర్ల హనుమకొండ శాసనములందు బేర్కొనబడిన ఉదయచోడమహారాజు పండితారాధ్యులు పానుగంటికి బోయినప్పు డచ్చట రాజ్యము సేయుచుండిన యుదయావనీశ్వరుడు కాజాలఁడు. అతఁడు మఱియొక్కడై యుండవలయును. విళంబినామసంవత్సరమున క్రీ. శ. ౧౧౭౭-౭౮ వ్రాయించిన మామిళ్లపల్లె శాసనమున నీక్రిందివంశక్రమము గలదు.




ఇందు బేర్కొనబడిన ఉదయాదిత్యుఁడు మల్లికార్జున పండితుని

సమకాలికుఁడై యుండవచ్చును. ఈ విషయమింకను పరిశోధింప దగినది.

## ౮. బసవన్న ౭

బెల్దేవి వేమనారాధ్యుఁడు పోరండ్ల సూరసాని మున్నగు జంగములు మల్లికార్జున పండితారాధ్యుని సందర్శించుటకు దాక్షారామమునకు వచ్చునప్పటికె బసవన్న కల్యాణకటకమున బల్లహునికి మంత్రియై వర్ధిల్లుచుండెను. బసవన్న భక్తిమహిమ లనువర్ణించి వారతని కచ్చెరువు గల్గించిరి. తరువాత కర్ణాట భాషనలపరచుకొనగోరి పండితుఁడు తనశిష్యులను బసవనికడ కంపెను. చందవోలునుండి తరలిపోయి పండితారాధ్యు లమరావతి నుండగా బసవఁడాతనికి భస్మమంపెను. తన్మూలమున నాతనికి గర్ణాటకభాషయందు కవిత్వము జెప్పుశక్తి కలిగెనట. అప్పటి కింకను బసవడు కల్యాణకటకమున బల్లహునికి మంత్రిత్వము నేయుచునేయుండెననుట తెల్లము; తరువాత మల్లికార్జునుడు వనిపురమునకు బోయి శంకరయ్య యను భక్తునిచే సత్కృతుఁడయి యచటినుండి బసవదర్శనార్థము కల్యాణకటకమునకు బోవ నుద్యమించుచుండఁగా నొక అయ్యవచ్చి, "కల్యాణములో భక్తి గజిబిజి పుట్టినది. జగదేవమొల్లె బొమ్మయలు బిజ్జలుని భంజించిరి. బసవదండనాయకుడు కప్పడి సంగమేశుని గర్భము జొచ్చెను. ఇది జరిగి నేటికెనిమిది దినములాయెను. ఇది నిక్కము" అని చెప్పెను. తరువాత మల్లికార్జునుఁడు బసవనిర్యాణమునకు చింతించి యటనుండి శ్రీపర్వతయాత్రకు బయలువెడలి వెల్లటూరును జేరెను. ఆనచటనే యాగి తన మూరు శిష్యుఁడైన దోనమయ్యను గిరి ప్రదక్షిణమును నేయ నంపెను. దోనమయ్య

గిరి ప్రదక్షిణము జేసి మరలివచ్చినంతటనే మల్లికార్జున పండితారాధ్యులు పైవెల్లటూరునందే లింగైక్యమునందెను.

బసవన్న పండితారాధ్యులసమకాలికత్వము పై యంశములమీద నాధారపడియున్నది. వీనినెల్ల బరిశీలించి లక్ష్మణరావుగారు పండితేంద్రుడు మరణసమయమునకు వృద్ధుడు... పండితుని మరణము బసవేశ్వరుని తరువాత ద్వరలోనే తటస్థించెనని మనమెంచినయెడల క్రీ. శ. ౧౧౯౦ ప్రాంత మతని మరణకాలమని నిర్ణయించుకొనవచ్చును. అప్పటి కాతడు ౭౦ యేండ్లవాడని యెంచినయెడల క్రీ. శ. ౧౧౨౦ ప్రాంత మాతని జన్మకాలమగును. ఇట్లీతడు మొదటివెలనాటి చోడుని కాలమునను రెండవవెలనాటి చోడుని కాలముననునుండిన నుండవచ్చునని తీర్మానించినారు.[1] ఈతీర్మానమును శ్రీ బండారు తమ్మయ్యగారంగీకరించలేదు. "శ్రీలక్ష్మణరావుగారు పండితారాధ్యుడు క్రీ. శ. ౧౧౯౦ వఱకు జీవించియుండెనని తలంచుట కెట్టియాధారములును లేవు. బసవేశ్వరుని నిర్యాణకాలము క్రీ.శ. ౧౧౬౮ అని వారంగీకరించిరి. అట్టిచో బండితారాధ్యుడు బసవేశ్వరుని యనంతరము ౨౨ సంవత్సరములు జీవించియుండెనని వారు తలంచుట యసంగతము. బసవేశ్వర పండితారాధ్యులనుగూర్చి తెలియుటకు వారియనంతర మనతి కాలముననే రచితములైన సోమనాథుని కృతులకన్న ప్రబల ప్రమాణములు లేవు." వీనినిబట్టి చూడగా, "బసవేశ్వర పండితారాధ్యుల నిర్యాణ కాలములకు నడుమ నొక్క శివరాత్రియేగాని పెక్కుశివరాత్రులు గడచియుండవని స్పష్ట

1. శివతత్వ సార పీఠిక. పుట ౨౫.

మగును. కావున బండితారాధ్యుఁడు బసవేశ్వరుని తరువాత నత్యల్ప కాలములోనే క్రీ.శ. ౧౧౬౯-౭౦ సంవత్సరములలో శివైక్యమయ్యెనని తలంపనగును. వెలనాటి చోడుని శాసనములు ౧౧౬౩—౧౧౮౦ వఱకును గానవచ్చుటచేతను, చోడుఁడు నాతని సంతతి పండితారాధ్యుని శాపమహిమచే నిర్మూలమయిరని పండితారాధ్యచరిత్రమున వర్ణింపఁబడియుండుట వలనను శ్రీ లక్ష్మణరావుగారు వారందఱు నశించువఱకు బండితారాధ్యుఁడు బ్రతికియుండవలెనని తలంచి యాతనినిర్యాణకాలమును బొడిగించినట్లు తోచుచున్నది. అట్లు తలంచుట యనవసరము. పండితారాధ్యుఁ డొందినది స్వచ్ఛంద మరణము. అతని శాపముచే వెలనాటి చోడుఁడును నాతనిసంతతియు దరువాత నశించినను బండితుఁడు వారికంటె ముందుగనే బసవేశ్వరుని నిర్యాణవార్తవిని తానుగూడ సత్వరముగనే నిర్యాణమును బడసెనని యెంచుట కెట్టి యభ్యంతరమును లేదు. కావున బసవేశ్వర పండితారాధ్యు లించుమించుగ నేకకాలముననే లింగైక్యమొందియుందురని తలంచుట సమంజనము". [1]

తమ్మయ్యగారికిని లక్ష్మణరావుగారికిని అభిప్రాయభేదము గల్గినది మల్లికార్జున పండితారాధ్యుని నిర్యాణకాలమును గూర్చి. పండితునినిర్యాణకాలము బసవన్ననిర్యాణకాలముపై నాధారపడియున్నది. లక్ష్మణరావుగారును తమ్మయ్యగారును మాత్రమే కాక బసవన్నచరిత్రను పరిశోధించిన పండితులును జరిత్రకారులును బసవన్న క్రీ. శ. ౧౧౬౭—౬౮ లో లింగైక్యమందెనని చెప్పుదురు. దీనికర్వాచీన శైవ జైన గాథలు దప్ప

1. పాలకురికి సోమనాథకవి. పుటలు. ౯౫—౯౭.

విశ్వాస పాత్రములగు నన్యాధారములు లేవు. ఇందు వచింపబడినట్లు కల్యాణకటకమున కాలచుర్య బిజ్జలునకు బసవన్న మంత్రియైయుండెనని రుజువుసేయగల శాసనాధార మెద్దియు లేదు. బిజ్జలునియొక్కయు నతని సంతతివారియొక్కయు వారి సామంత దండనాయకాద్యధికారివర్గముయొక్కయు శాసనములు బెక్కుగలవు. ఇందెందును బిజ్జలునికి ప్రధానమంత్రియై యతనిపేర రాజ్యపాలనము నేయుచుండిన బసవ దండనాయకుని ప్రస్తావము లేకపోవుటచిత్రము. [1] శాసన సాక్ష్యము లేకపోయినను జైన వీరశైవ గాథలను ద్రోసి పుచ్చక బసవడు బిజ్జలుని ప్రధానియని యంగీకరించినను నతం డెప్పుడు బిజ్జలుని జంపించి లింగైక్యమును జెందినదియు నిర్ధారించిచెప్పుటకు వలనుపడదు. లక్ష్మణరావుగారును దమ్మయ్యగారును వారివలెనే ఇతర వాఙ్మయపరిశోధకులును బసవన్న నిర్యాణకాలము క్రీ. శ. ౧౧౬౮ అని చెప్పుచున్నారు కదా. వీరి సిద్ధాంతమున కాధార మెద్ది? బిజ్జలుడు వధింపఁబడిన తరువాత స్వల్ప కాలములోపలనె బసవన్న లింగైక్యమందె నను గాథ. బిజ్జలుని శాసనములను బరిశీలించి చూడఁగా నతఁడు క్రీ. శ. ౧౧౬౭ వఱకె రాజ్యము జేసినట్లు తెలియ వచ్చుచున్నది; అటు పిమ్మట నతఁడు రాజ్యమును దన పుత్రుండగు వీర సోవిదేవునికప్పజెప్పి విశ్రాంతినందెను. శాసనములను వీరశైవ జైన గాథలను నిశితదృష్టి బరిశీలించి డాక్టరు ఫ్లీటు గారు, బసవ చెన్నబసవాదులబోధవలన వీరశైవము పెచ్చు పెరుగుటయు, నామతాభివృద్ధికడ్డపడుటవలన బిజ్జలుడు విశ్రాంతి

1. చూ. అనుబంధము—అర్జున వాడ శాసనము.

నందిన పిమ్మట వారిచే వధింపబడుటయు నసంగతముగాదని తీర్మానించిరి. [1] వీరశైవులు బిజ్జలుని హత్యచేసియుండుట వాస్తవమైన యెడల నాహత్య యెప్పుడు జరిగెనో ఫ్లీటుగారు చెప్పలేదు; కాని పరిశోధకులెల్లను బిజ్జలుడు కుమారుని రాజ్యమునకభిషిక్తుని గావించి విశ్రాంతినందిన వెంటనే వధింపఁబడెననియు ననంతరమల్పకాలములోనె బసవన్న లింగైక్యమందెననియు నిశ్చయించి బిజ్జల వధ క్రీ. శ. ౧౧౬౭ లోను బసవన్న నిర్యాణము క్రీ. శ. ౧౧౬౮ లోను జరిగెనని యుద్ఘాటించుచున్నారు. కాని పండితారాధ్యచరిత్ర సాక్ష్యమీ సిద్ధాంతమునకు విరుద్ధమగుచున్నది. వెలనాటి చోడడు మృతి నందినప్పుడు మల్లికార్జున పండితారాధ్యు డమరావతియందుండె ననియు, నతని శిష్యుడైన ఫణిహారి చోడని జంపివచ్చినట్లు నివేదింపగా దన ప్రతిజ్ఞ ప్రకారమతఁడు మరల కన్నుల బడసె ననియు ముందే నిరూపించియున్నాడను. వెలనాటి చోడని కడపటి శాసనము క్రీ. శ. ౧౧౫౦ వ్రాయించినదగుటవలన నతని మరణ మాసంవత్సరమునకు ముందు సంభవించియుండ జాలదు; కావున శ్రీ బండారు తమ్మయ్యగారు వాదించునట్లు గాక క్రీ. శ. ౧౧౫౦ సంవత్సరమున వెలనాటి చోడుడు మృతుఁడైనవెనుక మల్లికార్జున పండితారాధ్యులు జీవించి యుండిరని పండితారాధ్యచరిత్ర సాక్ష్యమువలన రుజువగు చున్నది. అంతకుముందే కల్యాణమున గసిబిసియై బసవడు

---

1. Dynasties of the Kanarese Districts. pp. 477—484. కాని యీతీర్మానమును రుజువుచేయగలసాక్ష్యము విశ్వాసపాత్రమైనది కానరాదు.

పదచ్యుతుడై పారిపోయెను. ఈసందర్భమున పండితారాధ్య చరిత్రలోని యీ క్రింది ద్విపదలను స్మరణకు దెచ్చుకొన దగియున్నవి. పండితారాధ్యుని శిష్యులగు రేవయ దేవయలు బౌద్ధాచార్యుని వధించి

"జగతి బిజ్జలు జంపి చనుమల్లె బొమ్మ
జగదేవ వీరుల చరణాంబుజములు"
"నాపయోనికి దచ్చివాచారమిడిన
తేపగా రేమయ దేవయలరుగ" [1].

నని చెప్పియున్నది. మఱియు బండితారాధ్యులు చందవోలు లింగోద్భవస్వామి సముఖమున,

వేయేల మనదండనాయక బసవ
ధీయుత శాపప్రతిజ్ఞా ప్రశస్తి
నెల్లవారును జూడ నీ నేలగడవ
బల్లహు పీఠంబు పాడైన యట్లు.
... ... ...
... ... వెలనాటిచోడ
ధరిణీతలేశ్వరాధమపతంగంబు
భస్మమయ్యెడు..............."

నని శపించెను. ఇట్లే పండితారాధ్యులు పానుగంటిలో నున్నప్పు డుదయావనీశ్వరుని పెద్దలెంకయైన ధవళేశునామయ్య,

"అల్లయ్యమధువయ్య యను భక్తవరుల
బల్లదుండై రాజు వఱపుడునతని
యాయతైశ్వర్యంబు నతులప్రతాప

1. బసవపురాణము...ఆ. 2 (ఆం. గ్రం. మా. ద్వితీ. ముద్ర.) పుట. 209-10

మాయుష్యమును భవిష్యమురాజ్యరమయు
నవనిలో జాళుక్యులనుపేరుహారుని
కవిలియదుడిపించి కల్యాణ కటక
మీఁడిత భక్తి మహిష్ఠత పేర్మిఁ
బాడుగా శపియించె బసవనమంత్రి
మసలక జగదేవ మొల్ల బ్రహ్మాయలు
వాసపరిబిజ్జలు బొరిగొనిరట్ల.

యని బసవన్న మాహాత్మ్యమును గీర్తించి యాత్మహత్యజేసి కొనెను. కావున మల్లికార్జునుఁడు క్రీ. శ. ౧౧౮౦ సంవత్సరమున చందవోలునకు వచ్చునప్పటికే బిజ్జలుఁడు వధింపబడె ననుట తెల్లము; కాని బసవన్న యప్పటికింకను లింగైక్యము నంద లేదు. ఏలనఁగా బండితారాధ్యులు చందవోలునుండి బయలు వెడలి యమరావతికిబోయి యందు వసించియున్నప్పుడు,

"పటు భక్తి కర్ణాట భాషయర్థించి
యటమున్న బసవదండాధీశుకడకు
బుచ్చిన జంగమంబును భక్తవరులు
వచ్చి యా బసవన్న వరమహాత్వంబు
బ్రస్తుతింపుచు సమర్పణ నేయ బసవ
హస్తానుగతభూతియందు నంతటను
గర్ణాటభాష సాంగముగ బ్రాణేశు
గర్ణాట గీతసంగతులు బాడుచును."

బసవని యాతుణమే వీక్షింతునని కల్యాణకటకమునకు బయలు వెడలెను. కాని మార్గమధ్యమున వనిపురమున బసచేసి

యుండగా గల్యాణమున గసిబిసిపుట్టి జగదేవ మొల్ల బొమ్మ యలు బిజ్జలుని భంజించిరనియు

"నేగి కప్పడి సంగమేశ్వరంబునకు
దాగోరి బసవన దండనాయకుఁడు
నిచ్చమై నాసంగమేశు గర్భంబు
జొచ్చె దేహముతోన జోద్యమొప్పార."

నను వర్తమానము దెలియవచ్చినది.

పై నుదాహరింపబడిన ద్విపదలవలన క్రీ. శ. ౧౧౮౦ వ సంవత్సరమున మల్లికార్జున పండితారాధ్యులు చందవోలునకు వచ్చుటకు ముందె బిజ్జలుఁడు వధింపబడెననియు, నతఁడమరావతి యందు బసచేసియుండినప్పటికి బసవడింకను సజీవుఁడై కల్యాణ కటకమున నివసించుచుండెననియు, నతఁడు వనిపురమును జేరు నప్పటికి బసవడు లింగైక్యమందెననియు దెలియుచున్నది. బిజ్జ లునివధ మొదలు బసవన్న లింగైక్యమునందువఱకును కల్యాణ కటకమునందు సంభవించిన ముఖ్యాంశములన్నియు బసవపురాణ మున సంగ్రహముగ వర్ణింపబడినవి. బిజ్జలుఁడు నిష్కారణముగ నల్లయ్యమధుపయ్యలను భక్తులకన్నుల బెఱికించెను. బసవ డందుకు గోపించి కల్యాణమున నటు మీఁద నుండరాదని నిశ్చ యించి జగదేవుని బిలిచి బిజ్జలుని జంపుమని యాజ్ఞాపించి భక్త లతోగూడ కప్పడి సంగమేశ్వరమునకు దరలిపోయెను. జగ దేవుఁడా రాత్రి మొల్లయ బ్రహ్మయలతో గూడ బిజ్జలుని కొలువుకూటమునకుబోయి బిజ్జలునివధించి యవ్వల స్వగృ హమునకేగి యాత్మహత్య జేసికొని చచ్చెను.

"అంతరాజ్యార్థమై యనిచేసి యతని
సంతానమెల్ల నిస్సంతానమయ్యె
... ... ... ...
భ్రమసి యమాత్యాది భటవర్గమెల్ల
దమలోనఁ జచ్చిరి సమరంబుచేసి
బసవని సత్యశాపమునగా జేసి
పసచెడికటకంబు పాడయ్యెనంత
వినియెనంతయు నట సనియె గూడలికి
గనియె సద్గురువు సంగయ దేవునచట"

ఈ ద్విపదలవలన బిజ్జలునివంశము నాశమైపోయిన సమాచారము దెలియవచ్చునంచాక బసవడు కప్పడి సంగమేశ్వరము నకు బోలేదనియు గల్యాణ ప్రాంతములం దెచ్చటనో నివసించుచుండెననియు విదితమగుచున్నది. ఇదియె వాస్తవమైన యెడల బసవడు క్రీ. శ. ౧౧౮౪ వ సంవత్సరమున నోయటు వెనుక కొంతకాలమునకో లింగైక్యమందెనని చెప్పవలసి యున్నది. ఇది సుసంగతమే. ఏలనఁగా క్రీ. శ. ౧౧౮౦ వ సంవత్సరమున వెలనాటి చోడడు మృతినందిన తరువాతగూడ నతఁడు జీవించియుండెనని పండితారాధ్యచరిత్రవల్ల రుజువగుచున్నది కదా; అటుపిమ్మట నాలుగేండ్లకాలమతడు జీవించి యుండుట యసంగతము కాదు. బిజ్జలునిపుత్రులు నల్వురతని వెనుక కల్యాణపురమున రాజ్యము సల్పినట్లు వారిశాసనముల వల్ల దెలియుచున్నది. రాయమురారి సోవిదేవుఁడు క్రీ. శ. ౧౧౬౭ మొదలుకొని ౧౧౭౭ వఱకును, నిశ్శంకమల్ల సంగ

ముఁడు ౧౧౭౭ మొదలుకొని ౧౧౮౧ వఱకును, వీరనారాయణ ఆహవమల్లుఁడు ౧౧౮౧ మొదలు కొని ౧౧౮౩ వఱకును సింఘణ ౧౧౮౩ వ సంవత్సరమునను సామ్రాజ్యాధిపత్యము వహించి భూపరిపాలన మొనర్చిరి. బసవపురాణమున జెప్పినట్లు బిజ్జలునిసంతానమెల్ల నిస్సంతానమగుటను బసవన్న వినియటుపిమ్మట కూడలికి సనుట వాస్తవమైనచో నతని కూడలిప్రయాణమును లింగైక్యమును క్రీ. శ. ౧౧౮౩ నకు తరువాతనె జరిగియుండవలయును.

ఇట్లు బసవన్న లింగైక్యమందినది క్రీ. శ. ౧౧౮౩ నకు తరువాతనని బసవపురాణసాక్ష్యమువలన నిర్ణీతమగుచున్నది. పండితారాధ్యులు లింగైక్యమందిన దటుతరువాత. బసవన్న క్రీ. శ. ౧౧౮౪ వ సంవత్సరమున గాలము చేసియుండునని మనమనుకొనినయెడల శ్రీబండారు తమ్మయ్యగారుచెప్పునట్లు వారిరువురి మరణకాలములమధ్య గడచిన దొక్క శివరాత్రియేయని యొప్పుకొన్నను మల్లికార్జున పండితారాధ్యులు క్రీ. శ. ౧౧౮౫ వ సంవత్సరమున మృతినందియుండవలయును. మల్లికార్జున పండితారాధ్యులు ద్రాక్షారామమున దపస్సుచేయుచుండినప్పటికే బసవన్న బిజ్జలుని మంత్రియై ప్రఖ్యాతినందియుండెను. అప్పటికి పండితుని ప్రాయము ముప్పదియేండ్లయియుండునని యూహించినయెడల నతఁడు క్రీ. శ. ౧౧౩౦ ప్రాంతమున జన్మించియుండవచ్చును. మరణకాలమప్పటి కతడు ౫౪, ౫౫ యేండ్లప్రాయమువాడై యుండనోపును.

## ప్ర క ర ణ ము. 3.

### పండితారాధ్యులు - పాల్కురికిసోమనాథుఁడు

పై చర్చవలన మల్లికార్జున పండితారాధ్యులు క్రీ. శ. ౧౧౩౦—౧౧౮౫ మధ్యవర్ధిల్లియుండునని తేలినది. ఇఁక నతని జీవనచరిత్రను రచించిన పాల్కురికి సోమనాథుఁ డెప్పటివాఁడో విచారింపవలసియున్నది. సోమనాథ పండితారాధ్యుల మధ్య నధమ మైదుతరములైన గడచి యుండవలయునని యింతకు ముందు నిశ్చయించితిమి. కావున పురుషాంతరమున కిరువది యైదేండ్ల చొప్పున లెక్కవేసిచూడ పండితారాధ్యుల మరణాంతరము క్రీ. శ. (౧౧౮౫-౧౨౫)—౧౩౧౦ వ సం. నకు మునుపు సోమనాథుఁడు వర్ధిలియుండుననుటకు వలనుపడదు.

కాని పై సిద్ధాంతమునకు ప్రబలమైన యాక్షేపము గలదు. కర్ణాటక కవిచరిత్రకారకులగు కీ. శే. శ్రీ ఆర్. నరసింహాచార్యులవారు పాల్కురికి సోమనాథుని కాలము సుమారు క్రీ. శ. ౧౧౯౫ అని నిర్ధారించినారు.[1] వేలనఁగా శృంగారసారమను, నామాంతరముగల యుద్భటకావ్యకర్త యైన సోమరాజనునతఁడు, "సముదంచద్వృషభ స్తవామర మహీజారామనం సోమనం" అని వృషభ స్త వరచయితయగు సోముని స్తుతించియున్నాఁడు. వృషభ స్తవరచయితయగు సోముఁడే పాల్కురికి సోముఁడని వీరేల గుర్తించిరో కారణము

1. కర్ణాటక కవిచరితె. సం. ౧. పుట ౨౯౨.

దెలుపలేదు. [1] సోమరాజు తన గ్రంథమును శకాబ్దము ౧౧౪౪ చిత్రభాను నందనఁగా క్రీ. శ. ౧౨౨౨ వ సం॥న రచించితినని యీ క్రింది పద్యమున జెప్పియున్నాడు:

"జననాథోత్తము సోమరాజ సుసిద్ధి కావ్యం వలం శాలివా
హన శాకాబ్దమ దెయ్యెసాసిరదనూఱుంసందనాల్వత్తునా
ల్కానెయా రంజిత చిత్రభానువవరా శ్వీజోత్సిత్రై కాదశీ
వనజారాతితనూజ వాసరదొళాద త్తల్లమం గర్పితం"

కావున క్రీ. శ. ౧౨౨౨ వ సం॥న నీ సోమరాజుచే గీర్తింపబడిన పాల్కురికి సోమనాథుడు తత్పూర్వుఁడని నిశ్చయించి యతఁడు క్రీ. శ. ౧౧౯౫ ప్రాంతమున నుండెనని తీర్మానించిరి. [2]. అది మొదలాంధ్ర వాఙ్మయపరిశోధకులు పాల్కురికి సోమనాథుని బసవనికిని మల్లికార్జున పండితారాధ్యులకును సమకాలికుఁడని వాదించుచు, తమ వాదమున కనుకూలముగాని చరిత్రాంశములకు విపరీతార్థములను గల్పించుచు, దమచే జేయఁబడిన నిర్ణయము నాధారము జేసికొని నూతన సిద్ధాంతములను బ్రతిపాదించుచు విశృంఖలవృత్తి బ్రవర్తించుచున్నారు. వీరి ప్రతికూల విమ

---

1. కీ. శే. వేటూరి ప్రభాకరశాస్త్రులవారు "కర్ణాటకవిచే స్తుతింపఁబడిన సోముఁడు వేఱొక్కఁడుగావచ్చుననగాదు. వృషభస్తుతి నెఱపిన సోముఁ డీతఁడే కాని వేఱొకఁడు లేఁడు" అని కొంకక నెలవిచ్చినారు. ఏమో! నరసింహాచార్యులవారికిగూడ నిట్టియభిప్రాయ మెకలిగెనేమొ! కాని పాలకురికి సోమనాథుఁడు రచించినది వృషాధిపశతకముగాని వృషభస్తవముగాదు.—చూ. బస పురా. పీఠిక. పుట. ౫.

2. కర్ణాటకవి చరితె. సం. ౧. పుట. ౨౯౨.

ర్నకు ప్రథమమున గురియైనవాఁడు పిడుపర్తి సోమనాథుఁడు. పాల్కురికి సోమనాథుని యుదంతము నతఁడిట్లు వివరించి యున్నాడు.

"ఒకనాడు ఓరుగంటిలో స్వయంభూదేవుని మంటపములో శివభక్తులందఱునుగూడి బసవపురాణమును జదువుచుండిరి. ప్రతాపుఁడు హరుని గొల్వనచటికివచ్చి వారినిగాంచి యీ సంభ్రమంబేమని యడిగెను. బసవపురాణమును భక్తులు వినుచున్నారని చెప్పఁగా, "నేను వినియెఱుఁగను, ఆ పురాణము విధమెట్టిది?" యని పృచ్ఛించెను. అందుకొక ధూర్త బ్రాహ్మణుఁడు, "పాలకురికి సోమపతితుఁ డీ నడుమను మధ్యవళ్లు పెట్టి ద్విపదను పెనచినాఁడు. ఇది యప్రమాణము, అనాద్యము" అని చెప్పఁగా రాజు వెడలిపోయెను. అంత నీ వృత్తాంతమును శిష్యులవలన నెఱిఁగి పరవాదులను జయించుటకు సోమనాథుఁ డోరుగంటికి వచ్చెను; ఆపట్టణము నేలు ప్రతాపుఁ డెదురువచ్చి యతనిని సత్కరించి పోయెను. అచట గొంతకాలము వసించినపిమ్మట నొకనాఁడు పిడుపర్తి శివరాత్రి కొప్పయ్యగారాదిగాగల తమశిష్యులనందఱ బిలిపించి, యీ దేశంబింక దురుష్కులచే నాక్రాంతంబు కాగలదు, మాబోటి నియమస్థుల కిందునికి పొందుపడదని,

"తన శిష్యుఁడును నాప్రతాపుని మంత్రియు
నగు నిందులూరి యన్నయ్య బిల్వ
బనిచి నీవెప్పుడు భక్తితో నఱవత్తు
ముగుర నర్చింతువు ముఖ్యవృత్తి

దత్ప్రీతిగా మా వ్రతస్థుల కొక గ్రామ
మిప్పించు మీధరాధీశుచేత
ననవుడు నతఁడు మహాప్రసాదంబని
యిప్పించె దొంకి పర్ధిగవృత్తి
నందు ప్రతివసింతు రఱువత్తుముగురును
దాము ప్రేమ గనడభూమి కరిగి
యచట భక్తులెల్ల నతి భక్తి సేవింప
గొంత కాలముండి యంత మీఁద." [1]

ఇందువలన పాల్కురికి సోమనాథుడు ఓరుగంటినేలు ప్రతాపునకును నతని మంత్రియగు నిందులూరి యన్నయ్యకును సమకాలికుఁడని తెలియుచున్నను, ప్రభాకరశాస్త్రులవా రేమనుచున్నారో వినుడు.

"ఆఱు పురుషాంతరములకు దర్వాతివాఁడగు పిడుపర్తి బసవన్న (సోమనాథుని) [2]గ్రంథము (పాల్కురికి) సోమనాథుని గ్రంథములకంటెను దత్సమకాలమువారి గ్రంథములకంటెను ప్రబల ప్రమాణము కాజాలదు. బహుకాలమునకు బిదప బసవన్న (సోమనాథుఁడు) వినికిళ్లనుబట్టి వ్రాసిన వ్రాతలలో గొన్నితప్పులు దొరలవచ్చును. పాల్కురికి సోమనాథుఁడు క్రీ. శ. ౧౧౯౦ ప్రాంతములవాడనుటయే సిద్ధాంతముగా నిశ్చయింపవలయును. పిడుపర్తి బసవన (సోమనాథుఁడు) ఓరుగంటిలోని భక్తులు బసవపురాణమును జదువుచుండగా

1. పద్య. బస. పురా. ౧. ౨౮-౩౯.

2. ప్రభాకరశాస్త్రులవారు ప్రమాదవశమున సోమనాథునికి బదులు బసవన్నను జేర్చిరి.

ప్రతాపరుద్రుఁడు వచ్చివినెనని వ్రాసినవ్రాత ప్రతాపరుద్రుని గూర్చి కాక రుద్రదేవునిగూర్చి కావచ్చును. రుద్రదేవుఁడు క్రీ. శ. ౧౧౯౫ దాక రాజ్యమేలినాఁడు గావున నాకథ యప్పుడు జరిగియుండవచ్చును. సోమనాథుఁడు రుద్రదేవునే ప్రతాపరుద్రుఁడని భేదము దెలియక చెప్పియుండవచ్చును.[1]

ఇట్లు ప్రభాకరశాస్త్రులవారు పిడుపర్తి సోమనాథుఁడు వాస్తవచరిత్ర నెఱుఁగక వినికిళ్ళపై నాధారపడి తప్పులు వ్రాసినాడని చెప్పఁగా శ్రీబండారు తమ్మయ్యగారింకొక మెట్టుపై కెక్కి యతని కతని వంశానుక్రమమే తెలియదని వక్కాణించినారు.

"పయినఁ జెప్పిన కారణములచే (పాల్కురికి) సోమనాథుఁడు ప్రథమ ప్రతాపరుద్రుని కాలమున నుండెననుట నిర్వివాదమనియు బిడుపర్తి సోమనాథుఁ డాతని తరువాత మూఁడువందల సంవత్సరములపయి కాలమున వెలసినవాఁడవుటచే నాతఁడు తనవినికినిబట్టి పద్యబసవపురాణావతారికలో వ్రాసిన సంగతులలో గొన్ని వ్యత్యాసములు చేరియుండును గావున నవి ప్రమాణము గావనియు బలువురు తలంచుచున్నారు. ఈ గ్రంథావతారికలో బిడుపర్తి సోమనాథుఁడు చెప్పికొనిన వంశానుక్రమణికనుబట్టి యాతఁడు పాలకురికి సోమనాథుని శిష్యుఁడుగా నం దుదాహృతుఁడైన పిడుపర్తి శివరాత్రి కొప్పయ్యకు నాఱవతరమువాఁడు కానగును." "పిడుపర్తి సోమనాథుఁడు శ్రీనాథునికి దరువాతివాఁడని యాతని గ్రంథమును బట్టియే వ్యక్తమగుచున్నప్పుడు, పాలకురికి సోమనాథుఁడు ౧౧౯౫ ప్రాంతమువాఁడని నిరూపితమగుచున్నప్పుడు, పిడుపర్తి

1. బస. పురా. పీఠిక. పుటలు ౬-౭.

సోమన చెప్పిన వంశానుక్రమణికకూడ సరికాదనియే చెప్పవలసి యుండును. శివరాత్రి కొప్పయ్యకు నాతని పుత్రుఁడుగ నుదాహృతుడయిన బసవయ్యకు నడుమ మఱికొన్ని తరములు గతించి యుండవలయును. [1]

ఇట్లు పిడుపర్తి సోమనాథుఁడు చెప్పిన పాల్కురికి సోమనాథవృత్తాంతము సత్యాత్మకమును విశ్వాసపాత్రమును గాదని వీరు త్రోసిపుచ్చినను, దానిపై వ్యామోహమును విడజాలరైరి. పాల్కురికి సోమనాథ ప్రతాపరుద్రుల సమకాలీనతను ద్యజింపలేక వీరుపడినతిప్పలుజూడ నెట్టివారిహృదయముననైన జాలి పుట్టకపోదు. "పిడుపర్తి బసవన (సోమనాథుఁడు) వ్రాసినవ్రాత ప్రతాపరుద్రునిగూర్చికాక రుద్రదేవునిగూర్చి కావచ్చును." అని ప్రభాకరశాస్త్రులవారనఁగా [2] బండారు తమ్మయ్యగారు కాకతి రుద్రదేవునికిఁగూడ ప్రతాపరుద్రుఁడను పేరుగలదని వాఙ్మయశాసనాద్యాధారములవలన నిరూపించుటకు నడుము బిగించిరి.

"ఈ మొదటి ప్రతాపరుద్రునకు రుద్రదేవుఁడనియే కాని ప్రతాపరుద్రుఁడను వ్యవహారము లేదని కొందఱు వాదించెదరు. శాసనములలో నితఁడు తఱచుగ రుద్రదేవుఁడని యుదాహరింపబడినను బ్రతాపరుద్రుఁడను వ్యవహారము నీతనికి లేకపోలేదు. ఈతనికి విద్యాభూషణుఁడను బిరుదముగూడ గలదు. నీతిసారమను గ్రంథమొకటి యీతఁడు సంస్కృతాంధ్రముల రెంటను గూడ రచియించినాఁడు. రెండవ ప్రతాపరుద్రునికంటె బూర్వుఁ

1. పాలకురికి సోమనాథకవి. పుటలు ౯౩-౯౪.

2. బస. పురా. పీఠిక. పుట. ౬.

డును, నాతని మాతామహి రుద్రమదేవికి సామంతుఁడును నగు బద్దెన (భద్రభూపాలుఁడు) తన నీతిశాస్త్రముక్తావళిలో నీతిసార మును బేర్కొనుచు నందు ప్రతాపరుద్రుఁడనియే వ్యవహరించి నాఁడు.

"పరువడి నాంధ్రభాష గల
బద్దెన నీతియు సంస్కృతంబులో
బరగ ప్రతాపరుద్ర నర
పాలునిచే రచియింపఁబడ్డ యా
నరవరు నీతిసారము వి
నం జదువంగడు మంచిదంచుఁ జె
చ్చెరఁ గవి నీతి పద్ధతులు
జేసె వినోదము బాలబోధకున్."

కొన్ని శాసనములలోఁగూడ నీతఁడు ప్రతాపరుద్రనామముతో బేర్కొనబడినాఁడు. కాకతీయ శాసనములిప్పటికిఁ గొంతవఱ కుపలబ్ధమైనను బాలకురికి సోమనాథునకుఁ బ్రథమప్రతాప రుద్రునకు గలసంబంధమును బ్రకటించు శాసనమొకటియు నింతదనుక లభింపకుండుట శోచనీయము. కొండవీటి దండ కవిలెలోమాత్రము శకసంవత్సరము మున్నగు వివరములు లేని యొకశాసన ముదాహరింపఁబడినది. అందులోనిభాగమునుఁ జూడుఁడు :

దదౌధరణి కోటాఖ్యం బ్రహ్మాప్రీత్యాపురంముదా
చంద్రార్థమకుట ప్రీత్యాచంద్రవాడి పురంద దౌ"
కేశవార్పణ బుద్ధ్యా వైదదావిష్ణుపురంభువి
సోమనారాధ్యగురవే పిడుపర్తి పురం దదౌ"

అదాత్ ప్రతాపరుద్రాఖ్యో భూపాలో ధర్మపూర్వకం
సప్తర్షి సంఖ్యయా గ్రామాన్ దదౌ సప్త ద్విజాయతే
ఏవం ప్రతాపరుద్రాఖ్యః కృతవాన్ రుద్రసంఖ్యయా.

ఈశాసనమునఁ బ్రతాపరుద్రుఁడనియే కలదు. మొదటి ప్రతాప రుద్రునికాలమునగాని రెండవప్రతాపరుద్రునికాలమున గాని సోమనారాధ్యగురుఁడు మఱొకఁడు దెలియరాడు. కావున నీ శాసనోదాహృతుఁడయిన సోమనారాధ్యుఁడు మనపాలకురికి నాథుఁడే కాఁదగును.[1]

ఇంతకష్టపడి పిడుపర్తి సోమనాథుఁడుచెప్పిన పాలకురికి సోమనాథోదంతమును గాకతి రుద్రదేవుని కంటగట్ట గంకణము గట్టుకొనిన ప్రభాకరశాస్త్రులవారేమి తమ్మయ్యగారలేమి యిందుఁలూరి యన్నయమంత్రి నీసందర్భమున సంస్మరింపక పోవుట చిత్రము గదా. సంస్మరించిన దమసిద్ధాంతము పుల్ల పోటువడ్డ బుద్బుదమువలె భగ్నమైపోవునను భయమేమొ.

తమసిద్ధాంతము స్థిరముగ నిలువగలదను నమ్మకము దత్ప్రతిపాదకులకుండినట్లగపడదు. అది కూలబడునేమో యను శంక వీరిని పీడించుచున్నట్లున్నది. కావున దానికి బ్రాపుగ పోటీలు వెదుకగడఁగిరి. శ్రీ కొమర్రాజు వేంకటలక్ష్మణ రావుగారు, "పండితారాధ్యచరిత్రముజెప్పిన పాలకురికి సోమ నాథుఁడు మల్లికార్జునపండితారాధ్యుల మనుమనినాటివాఁడు. ఈతనికాలము ౧౨వ శతాబ్దము చివరను ౧౩వ శతాబ్దారం భమున నగును." మఱియు "పండితారాధ్యునిచరిత్రమువ్రాసిన పాలకురికి సోమన పండితుని సమకాలికుఁడైన బెలిదేవి వేమనా

---

1. పాలకురికి సోమనాథకవి. పుటలు ౧౦౧-౧౦౩.

రాధ్యులమనుమని శిష్యుఁడు."[1] శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రులవారు పాలకురికి సోమనాథుని మల్లికార్జునపండితారాధ్యులకే సమకాలికునిసేయ సమకట్టినారు, చూడుఁడు :

"జంగమరత్నంబు శరణసమ్మతుఁడు
లింగైక్యవర్తి గతాంగవికారి
పండితారాధ్య కృపాసముద్గతుఁడు
మండితసద్భక్తి మార్గప్రచారి
విలసిత పరమ సంవిత్సుఖాంభోధి
సలిగరస్థలి సోమనాథయ్యగారు"

మొదలగు భక్తులనువేడి బసవపురాణ కథావృత్తాంతమును దాను దెలిసికొన్నట్లు సోమనాథుఁడు బసవపురాణమున జెప్పికొన్నాడు. మీఁది ద్విపదలలోఁ గరస్థలి సోమనాథయ్య 'పండితారాధ్య కృపాసముద్గతుఁడనికలదు. పండితారాధ్యులవారిశిష్యుఁడనియేని లేక తదనుగ్రహమున జనియించినవాడనియేని దాని కర్థమగును. తచ్ఛిష్యుఁడనుటయే యుక్తతరము. పండితారాధ్యుఁడనఁగా మల్లికార్జునపండితారాధ్యులే. ఆయన శిష్యుఁడైన కరస్థలి సోమనాథయ్యకుఁ బాల్కురికి సోమన సమకాలమువాఁ డని యేర్పడుచున్నది."—"ఇట్టి పండితారాధ్యుల వారి శిష్యునితో సంభాషించి బసవపురాణకథార్థముల నెఱిగిన పాల్కురికి సోమనాథుఁడు ౧౧౯౦ ప్రాంతములకంటెఁ దర్వాతివాఁ డయియుండడు. అది రుద్రదేవునిపరిపాలనమే కదా!"[2]

---

1. శివతత్త్వసారదీపిక. పుటలు. ౧౧, ౧౯. వీరి యభిప్రాయమునకు మూలాధారము సోమరాజకృతోద్భట కావ్యమందలి పద్యమె.

2. బసవపురాణ పీఠిక, పుటలు. ౫-౬.

మఱియొకదృష్టిని పరిశీలించిచూచియు శాస్త్రులవారు, తిక్కటీగెం ద్రొక్కినవాడు బయలుదేరినతావునకే మరలి వచ్చి చేరునట్లు, పై తీర్మానమునకే వచ్చినారు. "మఱియుం బండితారాధ్యులవారు లింగైక్యమందిన పిదప వారి శిష్యుండయిన దోనమయ్య, వారి ప్రథమపుత్త్రుం డయిన కేదారయ్యకు లోకారాధ్య పట్టమునుగట్టి తా ననర్గళముగా భక్తిరాజ్య మేలుచున్నట్టును [1] గేదారయ్యయు నలుగురుపుత్త్రులనుగాంచి వంశాభివృద్ధితో నున్నట్టును బండితారాధ్యచరిత్రలో గలదు. పాల్కురికి సోమనాథుని పండితారాధ్యచరిత్ర రచనాకాలమునకు పండితారాధ్యులవారి శిష్యుడును బుత్త్రుడును సజీవులైయున్నారని, మనుమలు పేర్వెలయుచున్నారని దీనివలన నేర్పడుచున్నది. సోమనాథుని గ్రంథములలో బండితారాధ్యచరిత్రము కడపటిది. ఈ సాధనమునుబట్టి చూచినను బండితారాధ్యుల లింగైక్యమునకు దర్వాత నిర్వదిముప్పదియేండ్లకే రుద్రదేవుని పాలనకాలనముననే (ఇంచుమించుగా ౧౧౯౦) సోమనాథుండు ప్రసిద్ధగ్రంథకర్తయయియున్నట్టు స్పష్టమగుచున్నది."

ఇంకను దమ కట్లసంచియందు గొన్ని సాధనములు గలవనియు, నవి డొంకతిరుగుడుగానుండి యీకాలముననే చేరునవిగా నుండుటచే విడనాడితిమనియు శాస్త్రులవారు తెలియబఱచినారు.[2] ఆ సాధన విశేషములెట్టివో !

---

1. శాస్త్రులవారు పొరపడినారు. భక్తి రాజ్య మేలుచుండినాతండు కేదారయ్యగాని దోనమయ్య గాడు.

2. బసవపురాణ పీఠిక. పుట. ౬.

శ్రీ బండారు తమ్మయ్యగారును పైయంశములను చర్చించుటలో దృష్టినందక కొన్ని క్రొత్తయుపపత్తులను జూపియున్నారు. "రెండవ ప్రతాపరుద్రునికి దరువాత నొక శతాబ్దిలోనున్న" "శివయోగసారకర్తయగు కొలని గణపతిదేవుఁడు" బాలకురికి సోమనాథుని బేర్కొన్నాడు. కర్ణాటకుఁడైన భీమకవి శకము ౧౨౯౧—క్రీ. శ. ౧౩౬౯ సంవత్సరమున బాలకురికి సోమనాథుని బసవపురాణమును గన్నడీకరించినాఁడు. క్రీ. శ. ౧౩౯౮ వ సంవత్సరమున శ్రీనాథుఁడు పండితారాధ్యచరిత్రమును బద్యకావ్యము జేసినాడు. "సోమనాథుఁడు రెండవ ప్రతాపరుద్రుని (క్రీ. శ. ౧౨౯౦—౧౩౨౬.) కాలముననే యున్న వాడయినచో నటుతరువాత నింత సమీపకాలములో నాతని బసవపురాణ పండితారాధ్యచరిత్రములు పైనిచెప్పినట్లు పరివర్తింపఁబడుట పొసగనేరదు." మఱియు క్రీ. శ. ౧౩౦౦ ప్రాంతమువాఁడైన విశ్వారాధ్యుఁడు స్వవిరచితమల్హణ స్తోత్ర వ్యాఖ్యానమున (పండితారాధ్య చరిత్రములోఁ) బురాణ ప్రకరణమున మల్హణునికథలో సోమనాథుఁడు,

"తనరుసద్భక్తిఁ "గాంతాకచప్రచయ"
యనుచు నుద్యుక్తుఁడై హరుమనం బలరఁ
బ్రస్తుతాలంకార బంధురమధుర
విస్తారమతిమల్హణస్తోత్ర మనఁగ
నప్పుడు ముప్పదియాఱు శ్లోకములు
సెప్పినంతట మెచ్చి శివుఁడుమల్హణుని"

అని వ్రాసిన వాక్యములను బురస్కరించుకొని యీ క్రింది విధముగ వ్రాసినాడు. "యద్యపి కాంతాకచేత్యాది షట్త్రింశ

ద్వ్యష్టోత్తరత్రిశతవర్షైస్తోత్రమిదంమల్లణేనాభాణీతి పాల్కురికి సోమేశ్వరేణ భణితం; తథాప్యుపరితనం వృత్తత్రయం బహుపుస్తకస్థితత్వాద్బహుపాఠసమ్మతత్వాద్వ్యాఖ్యాతం వస్తుతస్తుయుక్తిమద్భిః ప్రతిక్షిప్తం శ్రీమత్సోమేశ్వరవచన ప్రామాణ్యాదితి సర్వం శివం.”

“కావున నీ సంగతులనుబట్టి కూడ సోమనాథుఁడు ప్రథమ ప్రతాపరుద్రుని కాలము వాఁడనుటయే సంగతముగానుండును. ఈ కారణముల నెల్లసమాలోచింప సోమనాథుని కాలము క్రీ. శ. ౧౧౬౦—౧౨౮౦ అని నిర్ణయించుట సమంజసముగనుండును”. [1]

పై నుదాహృత ప్రమాణములుజాలవని గాబోలు శ్రీ నిడదవోలు వెంకట్రావుగారు పాలకురికి సోమనాథుఁడు క్రీ. శ. ౧౧౯౦ నుండి ౧౨౬౦ వఱకు విలసిల్లియుండెనని నిరూపించుటకు మఱికొన్ని నిదర్శనములను జూపియున్నారు. ఇందు మొదట బేర్కొనదగినది యథావాక్కుల అన్నమయ్యగారి విషయము. ఈయన తన సర్వేశ్వరశతకమున పాలకురికి సోమనాథుని స్తుతించుటయేగాక యాతని గ్రంథములనుండి భావములను సంస్కరించి (? సంగ్రహించి) తన గ్రంథమున జేర్చుకొనియున్నాడు; దీనికి నిదర్శనముగా సర్వేశ్వరశతకములోని,

‘అభిరమ్యంబుగ దూదికొండ మహనీయారాధ్య సోమేశ్వర
ప్రభుకారుణ్య వసంత సంజనితమత్పద్య ప్రసూనావళిన్
విభవంబొప్పగగూర్చి యెంతయులసద్విఖ్యాతి సంపత్సుక
ప్రభవంబైన భవత్పదద్వయమునారాధింతు సర్వేశ్వరా.’

---

1. పాలకురికి సోమనాథకవి. పుటలు, ౧౦౩-౧౦౪.

యనుపద్యము నుదాహరించినారు. యథావాక్కుల అన్న మయ్యగారు సర్వేశ్వరశతకమును

"శాకాబ్దంబులువార్ధి షట్కపురజిత్సంఖ్యం(౧౧౬౪) బ్రవర్తింపను
శ్లోకానందకరంబుగా మహిమతో శోభిల్ల సర్వేశ్వర
ప్రాకామ్య స్తవమొప్పఁజెప్పి శుభకృత్పౌష్య శుక్ల పక్షంబునన్
శ్రీకంఠార్పితమై వసుంధరపయిం జెన్నొంద సర్వేశ్వరా."

యని విన్నవించుకొన్నాఁడు.[1] శకాబ్దము ౧౧౬౪ క్రీ. శ. ౧౨౪౨ నకు సరియగును. "పై పద్యములో బేర్కొనఁబడిన సోమనారాధ్యుఁ డన్నమయ్య గురువని విమర్శకులు గుర్తించి యున్నారు. ఈతఁడు పాల్కురికి సోమనాథుఁడే కాఁదగునని నేనూహింతును. కావున సోమనాథుఁ డంతకుముందుగాని, లేక యన్నమయ్యయు సోమనాథుడును సమకాలీనులగుటగాని తటస్థించుచున్నది." మఱియు "నాగారాధ్యుని బసవవిజయము నను, దానిననుసరించిన తుమ్మలపల్లి నాగభూషణకవి పద్య బసవ విజయమునను, బసవన్నకథను శివదేవయ్య ప్రతాపరుద్రునకు జెప్పినట్లుగాఁగలదు. బసవన్నకథ మొదట దెనుఁగున రచించిన వాఁడు సోమనాథుఁడేకదా! ఆ తెనుగుకథనే శివదేవయ్య ప్రతాపరుద్రునిపేర రాజ్యము సేయుచున్న రుద్రమదేవికి చెప్పెను. ఈ యంశము క్రీ. శ. ౧౨౬౦కి ముందే బసవపురాణము మిక్కిలి వ్యాప్తిలోనున్నట్లు దెలియుచున్నది (?)... ఈరుద్రమదేవి యల్లుఁడగు ఇందులూరి అన్నయ మంత్రియే పిడుపర్తివారి వంశములో పూర్వుడును సోమనాథుని శిష్యుఁడును

1. సర్వేశ్వరశతకము. ౧౩౦-౧౩౧.

నగు శివరాత్రి కొప్పయ్యకు డోకిపఱ్ఱు నగ్రహారమును దాన మిచ్చినాడు. ఈ కాలమును ౧౨౬౦—౭౦ ప్రాంతము కావచ్చును."[1]

ప్ర క ర ణ ము. ౫.

ఇంతవఱకు శ్రీ కొమఱ్ఱాజు వేంకట లక్ష్మణరావుగారు మున్నగు వాఙ్మయ పరిశోధకుల యభిప్రాయములను సంగ్రహముగ దెలియపఱచితిని. వీరిలో వీరికభిప్రాయ భేదములు లేక పోలేదు. పాల్కురికి సోమనాథుని కాలావధులను ఖచితముగనిర్ణయించు సందర్భమున వీరు వేర్వేఱుదారులు ద్రొక్కియున్నారు. కాని, (౧) పాలకురికిసోమనాథుడు క్రీ. శ. ౧౨. వ శతాబ్ధాంతమునను ౧౩. వ శతాబ్దపూర్వార్ధమునను వర్ధిల్లెననియు, (౨) పిడుపర్తిసోమనాథుఁడు పాల్కురికి సోమనాథ వృత్తాంతమున బేర్కొన్న ప్రతాపరుద్రుఁడు గ్రీ. శ. ౧౧౬౩ మొదలు ౧౧౯౬ వఱకును బాలించిన కాకతిరుద్రుఁడనియు వీరైకకంఠ్యముగ బల్కుచున్నారు. తమ వాదమును నెలకొల్పుటకొఱకు వీరు చూపు నుపపత్తులెంతవఱకు గ్రాహ్యములో కనుగొనవలసి యున్నది. ఈయుపపత్తుల నీ క్రింద విధమున వర్గించి విచారించుట యుక్తముగ గాన్పించుచున్నది.

అ. కర్ణాటక సాక్ష్యము.

ఆ. రుద్రప్రతాపరుద్రులు.

ఇ. సోమనాథుని సమకాలికులు:—

౧. మల్లికార్జున పండితారాధ్య పుత్త్ర శిష్యాదులు.

---

1. Lives of Telugu poets. P. 349.

౨. సోమనాథుని గురువులు.

3. ,, శిష్యులు.

౪. ఇతరులు.

## అ. కర్ణాటక సాక్ష్యము.

### సోమరాజు

పై పేర్కొనిన విమర్శకులయభిప్రాయమునకు సోమరాజ కృతోద్భట కావ్యమందలి "సముదంచిద్వృషభస్తవామరమహీజారామనం సోమనం" అనువాక్యము పునాది. కాని యిందు పేర్కొనిన సోముడు పాలకురికి సోమనాథుఁడేయగునా? తత్కృతవృషభస్తవమే సోమనాథ కృతవృషాధిపశతకమగునాయను సంశయము బొడమచున్నది. వృషభస్తవము నెఱపిన సోముడితడే కాని వేఱొక్కఁడు లేడు, అను శ్రీ ప్రభాకర శాస్త్రులవారి వచనమును బ్రమాణముగ గైకొన్నను సోమరాజు కాలము వివాదగ్రస్తమై యున్నది. ఉద్భట కావ్యములో నేపద్యము నాధారపఱచుకొని నరసింహాచార్యులవారు సోమరాజుకాలమును నిర్ణయించిరో యా పద్యపాఠము కవికృతము గాదనియు నాచార్యుల వారిచే సంస్కరింపఁబడినదనియు శ్రీ. డాక్టరు ఎ. వెంకటసుబ్బగారాక్షేపించి, సోమరాజుద్భట కావ్యమును నరసింహాచార్యులవారు చెప్పునట్లు శ. ౧౧౪౪ చిత్రభానునందు వ్రాయలేదనియు ౧౪౪౪ చిత్రభానులో వ్రాసినాడనియు నిరూపించినారు. చూడుడు.

"పైఁజెప్పిన 'జననాథోత్తమ సోమరాజనుసిద్ధి కావ్యం' అను పద్యముయొక్క ద్వితీయచరణము, 'హానశాకాబ్ద మదెద్దొ సాసిరదనూాటెం సందనాల్వత్తు' అని కవిచరిత్రయందు పఠింపబడి యున్నదికదా? ముద్రితపుస్తకమునందు—పుట 330— ఈ చరణము 'హానశాకాబ్దమదెద్దొ సాసిరదనూార్సందనాల్వత్తునా' యని ముద్రింపబడియున్నది. ఈ ముద్రితపుస్తకమునకు ఆధారభూతమైన కాగితపు ప్రతియందును ఇదే పాఠమున్నది. కవిచరిత్రకారులు చూచియుండు ప్రతియుప్రాయశః ఇదే కాగితపు ప్రతియగుటవలన, వారు ఇచ్చియుండు 'హానశాకాబ్దమదెద్దొ సాసిరదనూాటెంసందనాల్వత్తునా' యను ద్వితీయచరణ పాఠము కవి వ్రాసినపాఠముగాదని స్పష్టమగుచున్నది. ఈ కాగితపు ప్రతిలోని పాఠమును అపరిశుద్ధమని స్పష్టమగుచునే యున్నది. ఇచట ద్వితీయచరణమునందు మొదటి ౧౨ అక్షరముల తరువాత రెండు గురువులుండవలసినస్థానమున నొక గురువు మాత్రము గలదు. ఒకగురువు గళితమైపోవుట వలన ౨౦ అక్షరములుండక ౧౯ అక్షరములు మాత్రము గలవు. ఈ కారణమువలన 'నూార్సంద' యనుదానిని 'నూాటెంసంద' యని కవిచరిత్రకారులు దిద్దినట్లు కానవచ్చుచున్నది. ఇది యుక్తముగనున్నదని తోఁచుటలేదు. ఇరువది యక్షరములుండవలసిన పాదమునందు 'సాసిరదనూాటెంసంద' యనియే కవి చెప్పియుండిన పక్షమున, ఈ పాఠము కాలక్రమమున యెట్టి వికృతిని పొంది యున్నను 'సాసిరదనూార్సంద' యని యెట్లుకాగలదు? అందు వలన 'నూార్సంద' యను నక్షరములు కవిచెప్పిన పాఠమునందే యుండెననియు, నీ 'నూా' అను నక్షరమునకుముందు ఒక

గుర్వక్షరము గళితమై పోయెననియుఁ దోచుచున్నది. అనఁగా నీ 'నూ' అను నక్షరమునకు ముందు 'మూ' యను నక్షరమునో లేక 'నా' యను నక్షరమునో కవి వ్రాసియుండెననియు గాకితపు ప్రతి మాతృకను అథవా దానియొక్క మాతృకను వ్రాసిన లేఖకుఁడు ఈ పద్యమును వ్రాయునపుడు ఈ యక్షరమును ప్రమాద వశమున విడిచియుండుననియు మా యభిప్రాయము. శక ౧౩౪౪ వ సంవత్సరము శుభకృత్సంవత్సరమును, శక ౧౪౪౪ వ వర్షము చిత్రభాను వర్షముగుటవలన కవియు 'సాసిరదనానూ నర్సంద'యనియే వ్రాసియుండవలయును"[1].

నరసింహాచార్యులవారు తాము 'నూర్సంద' ను నూజెంసంద' యని దిద్దలేదనియు తాము పరిశీలించిన ప్రతి యందు 'నూజెంసంద' యనియే కలదనియు బ్రత్యుత్తరమిచ్చిరి. కాని 'నూజెంసంద' యను పాఠముగల ప్రతిని వెలువరించరైరి. కావున, ఇందలి వాస్తవమును నిశ్చయించుటకు సాధ్యముగాక యున్నది. కాని డాక్టరు వెంకటసుబ్బయ్యగారు పై పద్యపాఠ నిర్ణయముతో దృప్తినందియుండక సోమరాజు పూర్వీకులందఱు క్రీ. శ. ౧౫, ౧౬ శతాబ్దములలో వర్ధిల్లిన వారని శాసన సాక్ష్యమూలమున నిరూపించియున్నారు. ఈ శాసన సాక్ష్యమే వారి వాదమునకు ప్రాణమువంటిది. శాసనసాక్ష్యమును వివరించుటకు ముందు ఉద్భట కావ్యమున సోమరాజు వర్ణించిన నిజవంశానుక్రమమును దెలిసికొనుట యుక్తము. "ఇతని

---

1. కెలవు కన్నడకవి గళజీవన కాలవిచార. పుటలు ౨౨౦-౨౧.

ప్రపితామహుఁడు చంద్రవంశోత్పన్నుఁడైన తిరుమలరాజు. పితామహుఁడు రాయణరాజు, తండ్రి ఇందుశేఖరరాజు. ఈ వంశపురాజులెచ్చట రాజ్యపాలనఁజేయుచుండిరో తెలియదు. అయినప్పటికిని పశ్చిమతీరమునందు ఏలుచుండిన వీరశైవ మతావలంబకులైన చౌట రాజులందు తిరుమలరాయ చంద్రశేఖరులను పేరులు గానవచ్చుచున్నవి. ఈ కవి యావంశపు దొరలై యుండవచ్చునేమో? తెలియదు......తనగ్రంథమును రాయసము లింగరసు వ్రాయగా తాను నిర్మించితినని కవి చెప్పుచున్నాఁడు." అని నరసింహాచార్యులుగారు వ్రాసియున్నారు.

కాని సోమరాజు చౌట వంశజుఁడనుటకు దగిన యాధారము లెవ్వియు లేవు. డాక్టరు వెంకటసుబ్బయ్యగారు చెప్పినట్లు 'చౌటరాజులు ౧౫ వ శతాబ్దమున పశ్చిమతీరమందుండు మూడబిదిరెయం దేలిరనియు, మంగుళూరియందుండిన విజయనగరాధికారులకు లోబడియుండిరనియు సుమారు క్రీ. శ. ౧౬౦౦ లో వీరి రాజ్యము కెళదిరాజులకు వశమాయెననియు దెలియుచున్నది. వీరినిగుఱించి తెలియవచ్చునదంతయు నింతే. ఇంతకుమించిన విశేషము లెవ్వియు దెలియవు. క్రీ.శ. ౧౨౨౨లో నీ వంశపురాజులు రాజ్యముసేయుచుండుట యసంభవమని ధారాళముగా జెప్పవచ్చును. ఇంతేకాక తిరుమలరాజు చంద్రశేఖరరాజు అనుపేర్లు కవిచరిత్రకారులు చెప్పునట్లు వీరియందు కానవచ్చినను, సోమరాజు పేర్కొనియుండు రాయణరాజు,ఇందుశేఖరరాజు అను నామాంకితులైన దొరలు వీరిలోలేరని యర్థా

ప త్తివలన మన మూహింపవచ్చును.[1] సోమరాజు చవుట వంశజు డనుట కెట్టి యాధారమును గానరాదు.

ఈ సోమరాజెవ్వడో కనుగొనుటకు ముందితని ప్రపితామహునిగూర్చి యొకటి రెండుమాటలు చెప్పవలసియున్నది. ఇతనిపేరు తిరుమలరాజు. ఈ పేరునుబట్టి యతఁడు క్రీ. శ. ౧౫ వ శతాబ్దమునకు బూర్వుఁడు కాజాలడని చెప్పవలసియున్నది. మనుష్యులపేరులు కలకాలమొక్కరీతి నుండక యుగయుగమునకు మారుచుండును. కాలక్రమమున కొన్ని లయించిపోవును, అప్పటప్పటికి క్రొత్తవి కొన్ని యుత్పత్తి యగుచుండును. వేనవేలుగ మనదేశము నందన్నియెడలను గానవచ్చు శిలాశాసనములను తామ్రపట్టికలను, వాఙ్మయమును బరిశోధించి చూచిన నీవిషయము తెల్లముగాఁగలదు. కాలక్రమమున బ్రఖ్యాతికివచ్చు పుణ్యస్థలములనుబట్టియు మత విశేషములనుబట్టియు గొన్ని యేర్పడుచున్నవి. శ్రీశైల కాళహస్తి కాంచీపురములబట్టి మల్లికార్జున మల్ల కాళహస్తి కంచ్యాది నామములు మనుజులకు గలిగినవి. వైష్ణవ మాధ్వలింగాయత సమయములమూలమున రామానుజ హనుమంత బసవనామ

1. కెలపుకన్నడకవిగళజీవనకాల విచార. పుటలు ౨౧౯–౨౦. శకాబ్దము ౧౪౩౪ ఆంగీరస జ్యేష్ఠ బ. ౨ మంగళవారమునాడు కృష్ణదేవరాయలు విజయనగరమునుండి పృథ్వీసామ్రాజ్యము సేయుచుండగా రత్నప్పవొడయలు మంగలూరు బారకూరు రాజ్యములను రాయలవారి నిరూపప్రకారము పాలించుచుండగా సోమనాథదేవుని సన్నిధియందునిల్పిన శిలాశాసనమున చవుట తిరుమలరాజు పేర్కొనబడియున్నాడు. (See, SII. VII. No. 228).

ములు జనసామాన్యమునందు వాడుకలోనికి వచ్చినవి. తిరుమల నామముగూడ నిట్టిదే. విజయనగర రాయలపోషణక్రింద తిరుపతిలోని వేంకటేశ్వరస్వామి యాలయము ప్రఖ్యాతికివచ్చునం దాక తిరుమలనామము వాడుకలోనికి రాలేదు. సంగమ వంశజులు శైవులైన కారణమున వారి వైష్ణవస్థానమునందు విశేషము శ్రద్ధవహింపరైరి. తరువాతి విజయనగర చక్రవర్తులకంద ఱకును వేంకటేశ్వరుఁడిలవేల్పాయెను. క్రీ. శ. ౧౫-వ శతాబ్దమునకుముందు తిరుమలనామ మెచ్చటను గానరాదు. ౧౫-వ శతాబ్దమధ్యమున నది విజయనగరసామ్రాజ్యమున సర్వసామాన్యమైపోయినది. సోమరాజు ప్రపితామహుఁడైన తిరుమలరాజు కూడ నప్పటివాడేకావలయును, తత్పూర్వుఁడని యెంచుటకు వలనుపడదు.

ఈ సందర్భమున స్మరింపదగిన మాట మఱియొకటికలదు. ఇది రాయసము. సోమరాజు ఉద్భట కావ్యమును రాయసము లింగరసు వ్రాయగా దాను రచించితినని చెప్పినాఁడు. రాయసము తెలుఁగుమాటు "వ్రాయసము" దాని తొలిరూపము. రాయసమనఁగా వ్రాత, వ్రాతపనిసేయు నుద్యోగియని యర్థము. ఈమాట విజయనగరసామ్రాజ్యస్థాపనకు ముందుగానరాదు. పినవీరభద్రుని జైమిని భారతములోని 'యట గుళిందు నేమమర యుచుఁ దండ్రి వ్రాయసము జూచి భక్తినంది యతఁడు' అను నదియే యాంధ్ర వాఙ్మయమందలి ప్రథమ ప్రయోగమని తల చెదను. అటుతరువాత నిది రాయసమై వ్రాయు నుద్యోగము నకుపేరై విజయనగర రాజ్యాంగపద్ధతితోపాటు ద్రావిడ కర్ణాటకదేశములందు వాడుకలోనికి వచ్చినది. వీనినిబట్టి చూడగా

నుద్భటకావ్యకర్తయైన సోమరాజు విజయనగరయుగమున వెలసి యుండునని తోచుచున్నది. ఈ యూహ సరియైనదని క్రింద నుదాహృతములైన శాసనములు నిరూపించుచున్నవి.

ఈ శాసనములలో మొట్టమొదట బేర్కొనదగినది మైసూరు రాజ్యమందలి హాసనజిల్లా హాసనతాలూకా గ్రామ మను స్థలమునగలదు. శాలివాహన శకవర్షము ౧౪౯౫ శ్రీముఖ భాద్రపద శు. ౧౧ (క్రీ-శ. ౧౫౭౩ సెప్టెంబరు ౭-వ తారీఖు) సోమవారమునాడు వ్రాయించినది. శ్రీమన్మహారాజాధి రాజ రాపరమేశ్వర వీరప్రతాప ప్రౌఢదేవ రళియిందరావ ఆత్రేయ గోత్రద ఆపస్తంబసూత్రద శావాశ్వప్రవరద యజు శ్శాఖెయ సోమవంశద తిరుమల రాజనకొమారను నుగ్గెహళ్లియ రాయొడయర కొమార ఇందుశేఖర రాజగళకొమార...... బసవరాజయ మహాఅరసుగళు శాంతిగ్రామద నవరంగకల్లుబాగి లను కట్టిసి హళ్ళి ముఖవను నిక్కిసిదక్కెమంగళ మహాశ్రీ.” అని యున్నది.[1]

రెండవది హాసనజిల్లా హాసనతాలూకా బిట్టుగుండు హళ్లిగ్రామమునందుగలదు. ఇది శాలివాహన శకాబ్దము ౧౪౩౮ ధాతు సంవత్సర ఆషాఢ బ. ౫ కర్కాటక సంక్రాంతి పుణ్య కాలమున (క్రీ. శ. ౧౫౧౬ జూన్ ౨౯ తేదినాడు) వ్రాయిం చినది. అందు ‘శ్రీ వీరకృష్ణదేవరాయరుగజపతియమేలె దండ యాత్రెమాడి జయ స్తంభమనెత్తి బహాగ లివర దళవాయిగళు ఆత్రేయ గోత్రద అళియతింమర సొడయరమక్కళు......రాయ వొడయర కుమార ధనంజయ రాయరు కొట్ట అఘ్రార క్రమ

1 Ep. Car. V. Hn. 117.

వెంతందరె' అని యున్నది. మఱియు నందు రాయవొడయుల తల్లిపేరు విరూపాంబికయని వివరింపబడియున్నది.

"ఆకల్పం విరుపాంబికా పరివృఢ శ్రీతిమ్మరాజాత్మజో
జీయాత్ శ్రీభువనైకవీర విరుదో రాయక్షమావల్లభః."[1]

మూడవది హాసనజిల్లా అరసికెరె తాలూకా జావగల్లు గ్రామమునందుగలదు. ఇది శాలివాహన శకవర్షము ౧౪౩౭-వ యువ సంవత్సర మార్గశిర శు. 3 బుధవారము (క్రీ. శ. ౧౫౧౫ నవంబరు ౮-వ తేదినాడు) వ్రాయించినది. చంద్రవంశమున చెన్నమహీపతి పుట్టెననియు నతనికి తిమ్మభూపతి పుట్టెననియు నతనిపుత్రుఁడు నంజరాజేంద్రాపరనామధేయుఁడైన రాయణ మహీపాలునకు భైరవుఁడను కుమారుఁడు గలిగెననియు నతఁడు జావగలుసీమను పాలించుచుండెననియు నందు దెల్పియున్నది.[2] ఇవిగాక వీరికి సంబంధించిన శాసనములు మఱికొన్ని కాళహస్తియందు కానవచ్చుచున్నవి. శకాబ్దము ౧౪౩౬ భావ కార్తిక బ. ౧3 (క్రీ. శ. ౧౫౧౪ జూలై ౪-వ తేది మంగళవారమునాఁడు) కృష్ణదేవరాయలు సామ్రాజ్యపాలనము సేయుచుండగా ప్రౌఢదేవరాయలకుమారితయు పూండూరు చెన్నరాజు పుత్రుఁడును వేదరాయని సోదరుడును నగు తిమ్మరాయనిభార్యయునగు, విరుపాజియమ్మ కాళహస్తీశ్వరునకు దనకును దన తలిదండ్రులకును సుకృతము గల్గుటకు దానము జేసెను.[3]

---

1. Ep. Car. V. Hn. 13
2. Ep. Cār. V. AK. 2. ఈమూఁడు శాసనములను డాక్టరు వెంకటసుబ్బయ్యగారు తమ 'కెలవు కన్నడ కవిగళ జీవన కాలవిచార' యను గ్రంథమున నుదాహరించియున్నారు.
3. ARE. 176 of 1922

మఱియు నచ్చటనే యచ్యుతరాయలశాసనములు శకాబ్దము ౧౪౫౪ నందన వర్షమున (క్రీ. శ. ౧౫౩౨ జూలై మాసమున) వ్రాయించినవి నాలుగు కానవచ్చుచున్నవి. ఇందు అచ్యుతరాయలు సుగ్గిహల్లిరాయణరాజు ఉమ్మత్తూరు మల్లరాజు వెంకటాద్రి మున్నగువారికభయమిచ్చి సంరక్షించెనని చెప్పియున్నది.[1] ఈ శాసనములబడి పూండూరురాజుల వంశావళి యిట్లేర్పడుచున్నది.

చంద్రవంశము

ఆత్రేయ గోత్రము

అందు పూండూరు చెన్నరాజు

|

తిరుమల లేక

తిమ్మరాజు

ప్రౌఢ దేవరాయల కూతురు విరుపాజి

లేక విరుపాంబిక భర్త.

|

సుగ్గిహల్లి రాయణరాజు

ఇతనికే నంజరాజని నామాంతరము.

|

| | | |
|---|---|---|
| భైరవరాజు | ధనంజయరాజు | ఇందుశేఖరరాజు |
| | | \| |
| | | బసవరాజు. |

1. ARE. 157, 158, 173 and 182 of 1924.

వీరి కాలక్రమము నిట్లు స్థూలముగ నిర్ణయింపవచ్చును.
చెన్నరాజు కుమారుఁడైన తిరుమలరాజు ప్రౌఢదేవరాయల
కూతురగు విరూపాంబ లేక విరూపాజియమ్మను వివాహ
మాడెను గదా. డాక్టరు వెంకటసుబ్బయ్యగారు తిరుమల
రాజునకు గూతునిచ్చిన ప్రౌఢదేవరాయలు క్రీ. శ. ౧౪౧౯-
౧౪౪౬ ల మధ్య విజయనగరసామ్రాజ్యమును బాలించిన
ఇమ్మడి ప్రౌఢదేవరాయలని గుర్తించిరి.[1] ఇది పొరపాటు.
ఇమ్మడి ప్రౌఢదేవరాయల యనంతరము విజయనగరసామ్రాజ్య
మును బాలించిన రాజులలో ప్రౌఢదేవరాయ నామధారులు
మఱి యిర్వురు కలరు. ఇమ్మడి ప్రౌఢదేవరాయలకుమారుఁడగు
మల్లికార్జునరాయలు ముమ్మడి ప్రౌఢదేవరాయనామమును
వహించి క్రీ. శ. ౧౪౪౬ నుండి ౧౪౬౫ వఱకును సామ్రాజ్య
పాలన మొనర్చెను. ఇమ్మడి విరూపాక్షరాయలకుమారుఁడు
ప్రౌఢదేవరాయలొకడు గలడు. ఇతఁడు తండ్రియనంతరము
సింహాసన మధిష్ఠించెనని న్యూనిజు వ్రాసియున్నాడు. ఇతఁడు
పండ్రెండేండ్లు రాజ్యమొనర్చెనని కెళదినృప విజయమందును
కాలజ్ఞానములందును గలదు. ఇది వాస్తవమో కాదో నిర్ధా
రించి చెప్పుటకు వీలులేదు. కాని తండ్రి యనంతర మితఁడు
సింహాసనము నధిష్ఠించినదిమాత్రము సత్యము. క్రీ. శ. ౧౪౭౫
ప్రాంతమున వ్రాయించిన శాసనములు కొన్నింటియం దితఁ
డప్పుడు సామ్రాజ్యాధిపత్యము నేయుచుండినట్లు చెప్పి
యున్నది.—[2] ప్రౌఢదేవరాయల కుమార్తెయు తిమ్మరాజు

---

1. కెరవు కన్నడ కవిగళ జీవనకాల విచార. పుటలు ౨౭౨-౭౩.

2. Further Sources of Vijayanagara History, Vol. I. P. 64.

భార్యయు రాయణరాజు తల్లియు నగు విరూపాక్షియమ్మ కృష్ణదేవరాయల రాజ్యారంభకాలమున క్రీ. శ. ౧౫౧౪ కాలమున జీవించియుండెనని పై నుదాహృతమైన కాళహస్తి శాసనమువలన దెలియవచ్చుచున్నందున నామె తండ్రియైన ప్రౌఢదేవరాయలు విరూపాక్షరాయలపుత్త్రుడును నతని యనంతరము సింహాసనము నధిష్ఠించిన ఇమ్మడి ప్రౌఢదేవరాయలని తలంచుట సమంజసము. అగునేని యతని యల్లుఁడైన తిమ్మరాజును నప్పటివాడె కావలయును. అతనికాలము క్రీ. శ. ౧౪౭౫-౧౫౧౦ మధ్యనై యుండునని మనముజ్జాయింపుగా జెప్పవచ్చును. అతనితండ్రియైన పూండూరు చెన్నరాజు క్రీ. శ. ౧౪౬౦-౭౫ ల ప్రాంతమువాఁడు కావచ్చును. తిరుమలరాజ విరూపాక్షియమ్మల పుత్త్రుఁడైన రాయణరాజు పుత్త్రులగు భైరవరాజ ధనంజయరాజుల శాసనములను జూడ నతఁడు క్రీ. శ. ౧౫౧౪ నకు బూర్వమే రాజ్యపాలనము సేయగడగెనని తోఁచుచున్నది. అచ్యుతరాయల కాళహస్తి శాసనములవలన రాయణరాజు కృష్ణరాయల యనంతరము పదచ్యుతుఁడాయెననియు క్రీ. శ. ౧౫౩౨ ననో యించుక పూర్వమో యచ్యుతరాయ లతని పునఃప్రతిష్ఠితుని గావించెననియు దెలియుచున్నది. అతఁ డవ్వల నెంతకాలము రాజ్యపాలనమొనర్చెనో తెలియదు; ప్రాయశః క్రీ. శ. ౧౫౪౦ వఱకును నతఁడు జీవించియుండవచ్చును. ఏలనఁగా నతని పుత్త్రులెవ్వరును నతనివెనుక రాజ్యము జేసినట్లగపడదు. లభ్యపడిన శాసనముల జూడఁగా నతనివెనుక రాజ్యము నేలినాతఁ డాతని కడగొట్టు కొడుకగు నిందుశేఖరరాజ పుత్త్రుఁడైన బసవరాజు.

లేక రాయణరాజుపాలన క్రీ. శ. ౧౫౩౫ లో ముగిసెననియు నటుపిమ్మట నిందుశేఖరుఁడును బసవరాజును నొకరివెనుక నొకరు పాలించిరనియు నూహింపనగును. కావున పూండూరు వంశజుల కాలక్రమము నిట్లు నిర్ణయింపవచ్చును.

| | | |
|---|---|---|
| ౧. చెన్నరాజు | క్రీ. శ. | ౧౪౬౦ - ౧౪౭౫ |
| ౨. తిరుమలరాజు | ,, | ౧౪౭౫ - ౧౫౧౦ |
| ౩. రాయణరాజు | ,, | ౧౫౧౦ - ౧౫౩౫ |
| ౪. ఇందుశేఖరరాజు | ,, | ౧౫౩౫ - ౧౫౮౦ |
| ౫. బసవరాజు | ,, | ౧౫౮౦ - ౧౫౮౩+ |

పై నుదాహరింపఁబడిన పూండూరు వంశజుల శాసనములలోనెల్ల క్రీ. శ. ౧౫౮౩ లో బసవరాజు వ్రాయించినహాసన ౧౧౮-వ శాసన మత్యంతముఖ్యమైనది. ఏలనఁగా నందు వర్ణింపబడిన వంశావళియు నుద్భటకావ్యమున వర్ణింపఁబడిన సోమరాజు యొక్క వంశావళియు నొక్కటియే. చూడుఁడు:—

| హాసన ౧౧౮-వ శాసనము | ఉద్భట కావ్యము |
|---|---|
| చంద్రవంశము - ఆత్రేయ గోత్రము<br>అందు తిరుమలరాజు | చంద్ర వంశము<br>అందు తిరుమలరాజు |
| \| | \| |
| రాయణ రాజు | రాయణ రాజు |
| \| | \| |
| ఇందుశేఖర రాజు | ఇందుశేఖర రాజు |
| \| | \| |
| బసవరాజు | సోమరాజు |

రెండు వంశావళులకును చంద్రవంశమును బసవరాజ సోమరాజుల పితృపితామహప్రపితామహులగు నిందుశేఖర, రాయణ, తిరుమలరాజుల నామములును సామాన్యము. ఇచట స్మరింపదగిన విషయ మింకొక్కటి గలదు. సోమరాజు రాయసము లింగరసనునతఁడు వ్రాయగా దానుద్భటకావ్యమును నిర్మించితినని చెప్పుకొనియున్నాడుగదా. ఈ లింగరసనునతఁడు సోమరాజు పితామహుండైన రాయణరాజు కొలువునందలి మంత్రి. అతడు బహులిపిజ్ఞుఁడు, కవీశ్వరుఁడు, కన్నడ భాష యందు కబ్బిగరకై పిడియను గ్రంథమునురచించెను. స్వవిషయము నాతఁడిట్లు తన గ్రంథమున జెప్పుకొనియున్నాఁడు, చూడుఁడు.

> "ధురధీర సుగ్గిహల్లియరాయ భూవరన
> పరమ ప్రధాన సుకలాప్రవీణం కీర్తి,
> భరిత దిగ్వళయం విరూపాక్ష పాదారవింద మకరంద
> భృంగం.
>
> సరససంగీత నిపుణం బహులిపిజ్ఞం భూ
> సురవర విరూపాక్ష సుతలింగ మంత్రి పం"

బహులిపిజ్ఞుఁడగుటవలన నీ లింగ మంత్రి సోమరాజు నుద్భట కావ్యమునకు వ్రాయసకాడగుట సహజమే.

డాక్టరు వెంకటసుబ్బయ్యగారన్నట్లు, హాసన ౧౧౭-వ శాసనమున బ్రస్తుతింబడియుండు సోమవంశ సంభవుఁడైన తిరుమలరాజపుత్ర రాయణరాజకుమార ఇందు శేఖరరాజనుపేరుగల మనుష్యుఁడు ఉద్భట కావ్యమున దత్కర్తయగు సోమరాజు

తన తండ్రియని చెప్పియుండు సోమవంశజుడైన తిరుమల రాజ పుత్ర రాయణరాజ కుమార ఇందుశేఖరరాజు తప్ప వేరొక్కడు సర్వ కర్ణాట భూమండలమునను లేకపోవుటవలన వారిద్దరు నొక్కరేయనుటకు నెట్టి సంశయమును లేదు.[1] కావున హాసన ౧౧౭-వ శాసనమును వ్రాయించిన బసవరాజును నుద్భట కావ్యకర్త సోమరాజును నన్నదమ్ములనియు వారు క్రీ. శ. ౧౬ వ శతాబ్దమున వెలసిరనియు దృఢముగ బలుకవచ్చును. ప్రాయశః సోమరాజు బసవరాజుకంటె బెద్దవాడై యుండును. అతఁడు తన తాతయొక్క రాజ్య కాలముననో తండ్రియొక్క రాజ్యకాలముననో గతించియుండును. ఈ కారణమువలన దండ్రియైన ఇందుశేఖర రాజు మరణానంతరమతని రెండవ కుమారుడైన బసవరాజు గద్దెనెక్కి పితృపైతామహమైన రాజ్యమున కొడయఁడై యేల గడగెను.

మీఁది చర్చలవలన నుద్భట కావ్యకర్త సోమరాజు క్రీ. శ. ౧౬ వ శతాబ్దమువాడని నిశ్చయమైనది. కావున నతఁడు 'సముదంచద్విభ్రమభ్రాజదస్త వామర మహీంజా రామనం సోమఃం' అని స్తుతించిన సోముఁడు పాల్కురికి సోముడేయని యొప్పుకొన్నను దన్మూలమున బాల్కురికి సోమన క్రీ. శ. ౧3 వ శతాబ్ద ప్రారంభమువాడని కాని, ౧౨ వ శతాబ్దాంతము వాడని కాని చెప్పుటకు వలనుపడడు. పాల్కురికి సోముఁడు క్రీ. శ. ౧౪ వ ప్రారంభమున కాకతి ప్రతాప రుద్రునికి సమకాలికుఁడను వాదమునకది ఎంత మాత్రమును ప్రతిబంధకము కాజాలదు.

---

1. కెలవు కర్ణాట కవిగళ జీవన కాలవిచార, పుట ౨౨౨.

## ౨. విశ్వారాధ్యుఁడు

క్రీ. శ. ౧౩౦౦ ప్రాంతమున విశ్వారాధ్యుఁడు స్వవిరచిత మల్హణస్తోత్రవ్యాఖ్యయందు పాలకురికి సోమనాథుని బేర్కొనియున్నాఁడు. కావున సోమనాథుఁ డంతకు పూర్వము వర్ధిలియుండవలయునని శ్రీబండారు తమ్మయ్యగారనుచున్నారు. వీరు తలంచునట్లు విశ్వారాధ్యుఁడు ౧౩౦౦ ప్రాంతమువాడగునేని వీరి వాదము సరియైనదని యొప్పుకొనక తప్పదు; కాని యది సందేహాస్పదము. ఏలనఁగా, విశ్వారాధ్యుని కాలమును కెరెయ పద్మరసుని కాలమునుబట్టి యూహించి చెప్పవలసి యున్నది. కెరెయ పద్మరసు కాలము సుస్థిరముగ నిర్ధారింపబడక యభిప్రాయభేదముల కాస్పదమైయుండ దానిపై నాధారపడియుండు విశ్వారాధ్యుని కాలమెట్లు నిర్ణీతము కాగలదు? కెరెయ పద్మరసు నరసింహ బల్లాళుని యాస్థానమున నుండెను. రాఘవాంకచరితమునందు పైజెప్పిన వీరనరసింహ బల్లాలుని యొద్ద కరణికుఁడై యుండిన హరిహర లేక హరీశ్వరుఁడను కవి యొక్క మేనల్లుఁడగు రాఘవాంకుఁడు పంపాపుర ప్రభువైన దేవరాజు సభయందు హరిశ్చంద్ర కావ్యమును జదివెననియు, నోరుగంటికి బోయి కాకతీయ ప్రతాపరుద్రుని సభయందు వీరేశ్వర కావ్యమును నిర్మించి కుకవులనోడించెననియు నరసింహ బల్లాళుని మంత్రియైన కెరెయ పద్మరసును జూచుటకు బేలూరునకు బోయెననియు జెప్పియున్నది. కావున కెరెయ పద్మరస హరిహర రాఘవాంకులు సమకాలికులనియు, వీరు ముగ్గురును నరసింహ బల్లాళ పంపాపుర దేవరాజ కాకతీయ ప్రతాపరుద్రుల కాలమున నుండిరనియుఁ జెల్లమగుచున్నది. మఱియు,

భైరవేశ్వరకావ్యకథాసూత్రరత్నావళియందును రాఘవాంకుఁడు ఓరుగంటికిఁబోయి ప్రతాపరుద్రుని యాస్థానమున కావ్యము జెప్పి ప్రతిపక్షుల నోడించినట్లు చెప్పియున్నది. ఈ యంశములను బరామర్శించి కిట్టల్‌గారు పంపాపుర దేవరాజు ౧౨౮౫-౧౩౨౬ మధ్యను, గాకతీయ ప్రతాపరుద్రుఁడు ౧౨౯౨-౧౩౩౫ ల మధ్యను రాజ్యమొనర్చిరని చెప్పి, వీరికి సమకాలికుఁడగుటచేత నరసింహ బల్లాళుఁడు ౧౨౬౩ నుండి రాజ్యపాలనము జేసిన తన్నామాంకితుండగు హొయ్సలనృపాలుఁడని నిశ్చయించిరి. ఇతని యాస్థానమందుండిన హరీశ్వర కెరెయ పద్మరస రాఘవాంకులుగూడ నప్పటివారే కావలయునని చెప్పిరి.

శ్రీ ఆర్. నరసింహాచార్యులవారి యభిప్రాయముతో నేకీభవింపక పై ముగ్గురు కవులును సు. క్రీ. శ ౧౧౭౫ లోనుండిరని యీ క్రింది కారణములవలన నిరూపింప గడఁగిరి.

౧. మల్లికార్జునుఁడు. (సు. ౧౨౪౫) తన సూక్తిసుధారసమునందు హరీశ్వరుని గిరిజా కల్యాణమునుండి యనేక పద్యములను సంగ్రహించి కూర్చుకొనియున్నాఁడు. ఇందువలన హరీశ్వరుఁడు ౧౨౪౫ కు పూర్వమెయుండెనని వ్యక్తమగుచున్నది.

౨. సోమరాజు ౧౨౨౨ తన యుద్భట కావ్యమునందు 'ప్రమథానీక కథార్ణవేందు హరదేవాచార్యనం......విమల జ్ఞాన సుదీపికాస్ఫురితచేత స్సద్మనం పద్మనంబలగొండు పేళ్వనీ కావ్యమం' అని హరీశ్వరుని కెరెయ పద్మరసుని స్తుతించుటవలన వీరిద్దరును ౧౨౨౨ కంటె ముందటి వారై యుండవలయును.

౩. బిట్టి బల్లాళుఁడు ౧౨౬౩ లో రాజ్యము నేలిన వీర నరసింహ బల్లాళుఁడే కావలయునని కిట్టల్‌గారు చెప్పియున్నారు,

కాని పద్మణాంకుని (సు. ౧౩౮౫) కెరెయ పద్మరసు చరిత్ర రూపమైన పద్మరాజ పురాణమందలి,

"శ్రీ విపుళ నరసింహ-బల్లాళ భూమిపం
కోవిదం యువరాజ పట్టాన్వితం బిట్టి
దేవరాయనెనిప్ప పుత్ర సహితం యాదవాన్వయోద్ధరణ
నాదం."

నృసింహ భూపాలుఁడు 'కుమార కులచింతామణియగు బిట్టి దేవుని గూడి సింహాసనస్థుఁడై యుండెను' అను పద్య భాగముల నుండి కెరెయ పద్మరసు కాలమునందు శ్రీనృసింహ బల్లాళుఁడు రాజై యుండెననియు నతని కొడుకైన బిట్టి దేవుఁడు యువరాజై యుండెననియు దెలియ వచ్చుచున్నది. సోమరాజు (౧౨౨౨) కెరెయ పద్మరసును స్తుతించియుండుటవలన, ౧౨౨౨ కు ముందే పద్మరసుఁడును నరసింహుఁడును నతని కుమారుఁడైన యువ రాజ బిట్టిదేవుడును ఉండి యుండవలయును. హొయ్సళరాజ పరంపరలో విష్ణువర్ధనునికి—౧౧౦౪ - ౧౧౪౧—బిట్టిదేవుఁడను పేరున్నట్లు శాసనములవలన దెలియుచున్నది. ఈ బిట్టిదేవుని తండ్రికి ఎరెయంగ లేక వీరగంగ యనుపేరు కలదు. వీనికి నర సింహుడను నామాంతరములేదు. ౧౨౨౨ కు ముందు విష్ణు వర్ధనుని కొడుకు నరసింహ బల్లాళుఁడు తప్ప వేరు నరసింహ బల్లాళుఁడెవ్వఁడును లేడు. ఈ నరసింహ బల్లాళుఁడు ౧౧౩౬ నుండి ౧౧౭౧ వఱకు రాజ్యముజేసెను. ఇతని కొడుకు వీర బల్లా ళుఁడు. పద్మణాంకుఁడు ఈ వీరబల్లాళుని కాతని తాతయైన విష్ణువర్ధనుని పేరునే పెట్టి బిట్టిదేవుఁడని పిలిచి యుండవలయును.

ఈ నరసింహ బల్లాళుని కాలముననే (౧౧౩౭ - ౧౧౮౧) కెరెయ పద్మరసుఁడుండి యుండవలయును.[1]

౪. ౧౨౯౨ నుండి ౧౩౩౫ వఱకు నేలిన ప్రతాప రుద్రునియొక్క కాలమందు రాఘవాంకుఁ డోరుగల్లునకుఁబోయి యుండినట్లు మె. కెట్టల్ గారు చెప్పియున్నారు. కాని రాఘ వాంకుఁడు ౧౨౨౨ నకు బూర్వముండిన హరీశ్వరుని మేనల్లుఁ డగుటవలన నతఁడు ౧౨౯౨ నుండి ౧౩౩౫ వఱకు రాజ్యమేలిన ప్రతాపరుద్రుని సభకు బోయెననుట యసంభావ్యమై యున్నది. ఇండియన్ ఆంటిక్వేరి ౯. వ సంపుటము ౯వ పుటయందు కాక తీయ రుద్రదేవుని శాసనమొక్కటి కలదు. ఇది శక ౧౦౯౪ చిత్రభాను సంవత్సరమున అనగా క్రీ.శ. ౧౧౭౨ లో వ్రాయించి నది. ఈదొర యొక్క కాలముననే రాఘవాంకుఁడోరుగంటికి బోయి యుండవలయును. చెన్నబసవ పురాణమున రాఘవు డోరుగంటికి బోయినట్లు చెప్పియున్నదే కాని యచటి ప్రభువు పేరు జెప్పలేదు.

౫. పంపాపుర దేవరాజు హరిహరరాజుకు ముందు ౧౨౪౭ నుండి ౧౩౨౪ వఱకు రాజ్యభారము వహించినట్లు మె. బ్రౌన్ చెప్పుచున్నారని మె. కిట్టల్ వ్రాసియున్నారు. కాని పై జెప్పియుండు కారణమువలన నీదేవరాజు రాఘవుని కాలము కంటె సుమారు నూతేండ్ల తరువాత నుండినవాడై యుండ

1. హాసన ౪౨. ౪౩. శాసనములలో వీరబల్లాళునికి "విష్ణువర్ధన శ్రీ ప్రతాపహొయ్సన భుజబలవీర బల్లాళ" యను విశేష నామములు జెప్పి యున్నవి.

వలయును. రాఘవుని కాలమున దేవరాజను నొక దొరయుండి యుండిన పక్షమున అతఁడు వేరొక రాజై యుండవలయును. ఇతని విషయమై మనకేమియు దెలియదు. పద్మరాజ పురాణము నందు కెరెయ పద్మరసుయొక్క పితామహుఁడైన సకళేశ మాదరసు తన తండ్రియైన కల్లకురికె మల్లరసునితో తాను సంసారమును త్యజించి విరక్తుఁడనగు దుననగా మల్లరసు, 'బసవాదులు భక్తిని నెలకొల్పవలెనని కల్యాణములోవచ్చి యున్నారు. వారితో గూడ కొంతకాలము గడుపుము' అని చెప్పినట్లు తెలియుటవలన సకళేశమాదరసుని కాలమున బసవడు పుట్టియుండవచ్చును కెరెయపద్మరసునీ తండ్రియైన మాయ దేవుడును బసవడును సమకాలికులై యుండవచ్చును. కెరెయ పద్మరసు సుమారు ౧౧౬౫ లో నరసింహ బల్లాళుని యేలుబడి యందుండియుండ వలయును.

ఇంతేగాక పద్మరాజ పురాణమునందు రాఘవుఁడు గతించిన యెనిమిది దినములకు హరీశ్వరుఁడు 'పంపావిరూపాక్షలింగమునందడంగె' ననియు, గెరె పద్మరసుఁడు గాశికి పోవుచు హరీశ్వరుని జూచి 'నేటికెనిమిదవ నాటి కుమారవరుఁడు మిమ్ము దనలో నైక్యము గావించుకొను' నని చెప్పుటయు, మఱియు హరీశ్వరుఁడు నరసింహ బల్లాళుని యొద్ద కరణికుడై యుండుటయు, నీరాజుయొక్క సభయందే కెరెయ పద్మరసునికిని త్రిభువన తాతనికిని నైన వాదమున రాఘవుడట నుండినట్లు తెలియుట వలన నీముగ్గురును సమకాలము వారని వ్యక్తమగుచున్నది.

అని చెప్పి (I, ౧౬౬-౧౬౮), తదనంతరము

"వీరందరును సుమారు ౧౧౬౫ లో నుండియుండవలె నని యూహించుచున్నాడను."

అని (I, ౧౬౮) వ్రాసియున్నారు.

డాక్టరు ఎ. వెంకటసుబ్బయ్యగారు నరసింహాచార్యుల వారి యభిప్రాయమును ఖండించుచు నిట్లుచెప్పినారు. "ఈయభిప్రాయము సాధువని తోచుట లేదు."

౧. ఉద్భటకావ్యమును సోమరాజు క్రీ. శ. ౧౫౨౨ వ్రాసెనని ఇంతకుముందు (పుట. ౨౨౨) వ్యక్తము చేసియుండుటవలన నందు స్తుతింపబడియుండు హరిహర కెరెయ పద్మరసులు ౧౫౨౨ కంటె ముందె యుండిరని సిద్ధమగుచున్నదేతప్ప ౧౨౨౨ కంటె ముందు వారుండిరని సిద్ధము గాదు.

౨. మల్లికార్జునుడు సూక్తి సుధార్ణవమును సుమారు క్రీ. శ. ౧౨౬3 నందు వ్రాసెనని ముందు (పుట. ౧౮౭) చెప్పియున్నాము. ఈ గ్రంథమునందు హరిహరుని గిరిజా కల్యాణము నుండి యనేక పద్యము లుదాహరింపఁబడి యుండుటవలన నీ గిరిజాకల్యాణము క్రీ. శ. ౧౨౬3 నకు ముందు రచియింపఁబడెనని సిద్ధమగునే కాని రాఘవాంకుడు గాని కెరెయ పద్మరసు గాని యా సంవత్సరమునకు ముందుండిరని సిద్ధముగాదు.

3. పద్మరాజ పురాణమందలి పైవాక్యములలో నుపయోగింపఁబడిన "నరసింహబల్లాళ" యను మాటకు మొదటి

నరసింహ హొయ్సలుఁడని కవి చరిత్రకారులు చెప్పిన యర్థమంత సంగతముగానుండ లేదు. నరసింహ బల్లాళుఁడనఁగా నరసింహుని కొడుకైన బల్లాళుఁడని యర్థము. హొయ్సల చక్రవర్తులలో నరసింహ పుత్రులైన బల్లాళు లిరువురుగలరు. వీరిలో మొదటి వాఁడు ప్రథమ నరసింహుని కొడుకగు నిమ్మడి బల్లాళుఁడు. ఇత నికే వీర బల్లాళుఁడను పేరును గలదు. ఇతఁడు క్రీ. శ. ౧౧౭౩ నుండి ౧౨౨౦ వఱకును రాజ్యము నేలెను. రెండవవాఁడు ముమ్మడి నరసింహ హొయ్సలుని పుత్రుఁడైన ముమ్మడి బల్లా ళుఁడు. ఇతఁడు క్రీ. శ. ౧౨౯౧ - ౧౩౪౨ల మధ్య రాజ్యము నేలుచు నోరుగంటి ప్రతాపరుద్రునికి సమకాలికుఁడై యుండెను. అట్లగుటవలన పద్మరాజపురాణమందలి పై వాక్యములలో జెప్ప బడియుండు నరసింహ బల్లాళుఁడు ఈ ముమ్మడి బల్లాళుఁడేయని తోఁచుచున్నది. బిట్టి లేక విష్ణువర్ధన యనుపేరు హొయ్సల వినయాదిత్యుఁడు మొదలుకొని వీరబల్లాళుని వఱకు పాలిం చిన యావంశపు రాజులకెల్లను నుండెనని ముందే (పుట ౨౩) వ్యక్తపఱచియున్నాఁడను. ఈవీర బల్లాళుని కొడుకైన రెండవ నరసింహునికి గూడ విష్ణువర్ధన యనుపేరు శాసనములందు చెప్పి యున్నది. (మద్రాసు శాసనశాఖవారి ౧౯౨౦ వ సంవత్సర నివేదికలో గానవచ్చు ౪౦౮ వ శాసనమును జూడుఁడు. ఇది కంచియందున్నది). కాబట్టి విష్ణువర్ధన యనునది ఈ వంశపురాజు లకు మఱియును యువరాజులకు కులక్రమాగతమైన పేరై యుండెనని తోఁచుచుండుట వలన మూడవ బల్లాళుని కాల మందును యువరాజున కీపేరుండెననుట యసంభావ్యము కాదు.

౮. కవి చరిత్రకారులు జెప్పియుండునట్లొక కాకతీయ రుద్రదేవుఁడు క్రీ. శ. ౧౧౬౨ లో రాజ్యము నేలుచుండినాడనుటయే మో వాస్తవమే. కాని ఇతని రాజధాని యోరుగల్లై యుండలేదు. అది యనుమకొండ యని యీ రుద్రదేవుని కాలమున బుట్టిన అనుమకొండ లేక అనమకొండ యందలి యొక శాసనమున నుండు,

"తస్మా స్తేనుమకొండ నామనగరీ శ్రీ రాజధానీ వయా
యత్రోద్యత్సదఖండఖండపరశువ్యాజృంభణోజృంభితా
కందర్పస్య పురీవ సారతి మతీ శృంగారభారాన్వితా
మాహేంద్రీవచజిష్ణు విష్ణుసహితారంభా విలాసోర్జితా"

యను శ్లోకమువలన స్పష్టమగుచున్నది. వస్తుతః ఓరుగల్లు నగరము ప్రతాపరుద్రుని కాలమున నతనికి రాజధానిగ నిర్మింపఁబడెనని కాకతీయ రాజుల ఇతిహాసమువలన దెలియుచుండుట చేత చెన్నబసవపురాణము నందు ప్రతాపరుద్రుని పేరును జెప్పక రాఘవాంకుఁడు ఓరుగంటికి పోయినట్లు చెప్పియున్నను అప్పుడు ప్రతాపరుద్రదేవుఁడే యేలుచుండెనని మనమే యూహించుకొనవచ్చును. రాఘవాంకచారిత్ర, భైరవేశ్వర కావ్యకథాసూత్రరత్నాకరములన్నిటి యందును ప్రతాపరుద్రుని పేరును ఓరుగంటి పేరును రెండును జెప్పఁబడియున్నవి. క్రీ. శ. ౧౧౬౨ లో ననుమకొండ యందేలుచుండిన దొరకు రుద్రదేవుడను పేరు తప్ప ప్రతాపరుద్రుఁడను పేరు లేదు.

౯. రాఘవుని కాలమునందు పంపాపురమున దేవరాజను నొక చిన్నరాజు యేలుచుండెననుట అసంభవముగాదు.

వస్తుతః క్రీ. శ. ౧౨౮౬-౧౩౨౮ ల మధ్య పంపాపురములో నొక దేవరాయ లేలుచుండెనని మె. బ్రౌన్‌గారు చెప్పియుండుట వలన రాఘవాంకచారిత్రమున గీర్తితుఁడైన దేవరాయ లితఁడే యనుట కెట్టి సందేహమును లేదు.[1]

౬. పద్మరాజపురాణమున జెప్పియుండునట్లు కెరెయ పద్మరసుని పితామహుఁడైన సకళేశ మాదరసు (కవి చరిత్రకారులు చెప్పిన విధముగ) కాలమున బసవడు పుట్టెను. కెరెయ పద్మరసుని తండ్రియగు మాయిదేవుఁడను బసవడును సమకాలికులగుటచేతను క్రీ. శ. ౧౧౫౬-౧౧౬౭ ల మధ్య నేలుచుండిన బిజ్జలునికి బసవడు ప్రధానియైయుండి సుమారు ౧౧౬౭ నందే లోకాంతర గతుఁడగుటచేతను, మాయిదేవుని కొడుకగు కెరెయ పద్మరసుఁడు ౧౧౬౫ లో బాలుడై యుండ

1. క్రీ. శ. ౧౨౮౬ - ౧౩౨౮ల మధ్య పంపాపురముం దత్ప్రాంతరాష్ట్రమును ముమ్మడి సింగెయ నాయకుని సంతతి వారేలుచుండిరి. ముమ్మడి సింగెయపుత్రుఁడగు కంపిలి దేవుఁడిచట క్రీ. శ. ౧౩౦౦-౧౩౨౬ ల మధ్య రాజ్యము సేయుచుండినట్లు శాసనముల వల్లను సమకాలిక మహమ్మదీయ చరిత్రలవల్లను దెలియుచున్నది. ఇతఁడు పటుపరాక్రమశాలి. ఓరుగంటి ప్రతాపరుద్రునకును ద్వారసముద్రపు హొయ్సలముమ్మడి బల్లాళునకును సమానస్కంధుడై వారితో బెక్కు యుద్ధములొనర్చెను. మహమ్మద్ బిన్ తుఘ్లాకు సైన్యములను రెండు పర్యాయములోడించి తఱుమ గొట్టెను. మూడవ పర్యాయము వారితో హోరాహోరిగ బోరి రణశయ్య నలంకరించెను. ఇతఁడె రాఘవాంకుని కాలమున పంపాపట్టణము నేలుచుండిన దేవరాయలు. (See Origin of the City and Empire of Vijayanagara, App. B. pp. 164-170.)

వచ్చునే కాని యౌవన ప్రాప్తుఁడై బుద్ధితెలిసినవాఁడై యుండ జాలఁడు. పై జెప్పిన ౧౧౬౭ వ సంవత్సరమునకు దరువాత అనగా నతని ౬ వ యేట ౧౧౭౩ లో వీరబల్లాళుఁడు రాజ్యము సేయుటకు బ్రారంభించి యుండుటవలన కెరెయ పద్మరసు సుమారు ౧౧౬౯ నందు నరసింహ బల్లాళుని అనగా హొయ్సల ప్రథమ నరసింహుని [1] యేలుబడి కాలములో నుండియుండ వలయును." అను కవి చరిత్ర కారుల యభిప్రాయము సంగతమై యుండునట్లు కన్పట్టదు.

హరీశ్వరుఁడు హళెయ బీడులో నరసింహబల్లాళుని కొలువున కరణికుఁడై యుండి, యారాజొకనాడు లెక్క యడుగగా గణితమును విడిచి చేతులను బిసుకుకొనెననియు నదేమని రాజడుగగా, 'పంపా విరూపాక్షుని యాలయములో హారతి యెత్తగా దాని సెగ దాకి మేల్కట్టుయొక్క బట్ట భగులని మండుటను జూచి చేతితో నలిపి యార్పితి' నని చెప్పెననియు, రాజామాటను నమ్మక పంపా విరూపాక్షుని యాలయమునకు దూతనంపి హరీశ్వరుఁడు చెప్పినది నిజమని తెలిసికొని

---

1. కవి చరిత్ర కారులు (I, ౧౯౦, టిప్పణము ౪) చెప్పియుండు నట్లు ఈ హొయ్సల నరసింహుడు "మహేశ్వర సమయప్రతిపాళక" యని తరీకేరి ౧౭ వ శాసనమున స్తుతింపబడియుండుటయే మో వాస్తవమే. కాని ఇందువలన నితఁడు విష్ణుదేవుని మన్నన సేయుచుండలేదని కాని విష్ణుద్వేషి యని కాని నిర్ధారించుట యుక్తము గాదు. అరసీకెరె ౧౧౭ వ శాసనమున

విష్ణు నృపాల నగ్రసుత సీనరసింహ నృపాలకం కరం
విష్ణు పదాంబుజ ద్వయ మధూవ్రతన్" .

అని యీ నరసింహుఁడు విష్ణుభక్తుఁడనియే చెప్పబడి యున్నది.

యాశ్చర్యపడి 'విరూపాక్షాలయమునందే లెక్కలు వ్రాసి కొనుచు నుండుము' అని చెప్పి హరీశ్వరు నచటి కంపెననియు జెన్నబసవపురాణ పద్మరాజపురాణములందు జెప్పబడియుండుట వలన (కవిచరిత. I, ౧౭౦-౧౭౧ చూడుఁడు), ఈ నరసింహ బల్లాళుని కాలమున పంపాపట్టణము హొయ్సళుల యేలుబడి క్రింద నుండెనని స్పష్టమగుచున్నది. హళేబీడునుండి పంపా పట్టణమునకు బోవలసినట్లయిన నడుమ నొళంబవాడి 32,000 మొదలగు సీమలను దాటి పోవలసియుండెను. హొయ్సళ ప్రథమ నరసింహుని కాలమున నీ సీమలు హొయ్సళుల అధీన మునందుండక చాళుక్యచక్రవర్తుల క్రింది మహామండలేశ్వరులైన ఉచ్చంగిపాండ్యరాజుల వశమున నుండినవి. ఈ సీమలును పంపాపట్టణముండు సిందవాడిసీమయు హొయ్సళ వీరబల్లాళునిచే జయింపఁబడిన తదనంతరము అతనియొక్కయు నతని వంశీయులయొక్కయు స్వాధీనమునందుండినవి. కాబట్టి పద్మరాజ పురాణమునందు ప్రస్తుతింపబడియుండు నరసింహబల్లాళుఁడు మొదటి నరసింహుడై యుండడని దీనివలన స్పష్టమగుచున్నది.

ఇట్లు మీద చెప్పియుండు, "హరీశ్వరాదులు సుమారు క్రీ. శ. ౧౧౬౫ లో హొయ్సళ ౧-వ నరసింహుని సభ యందుండిరి" అను కవిచరిత్రకారుల యభిప్రాయము సంగతమైనది కాదని స్పష్టమగుచున్నది గదా. ఇంకను పై బేర్కొన్న రాఘవాంకచారిత్ర, పద్మరాజపురాణ, భైరవేశ్వర కావ్య కథాసూత్రరత్నాకరము మున్నగు వీరశైవగ్రంథములను మనము నమ్మితిమేని మె. కిట్టెల్ గారు చెప్పినట్లే (చూడుము.

౨౪౦ పుట) రాఘవాంకుఁడు ఓరుగంటిలో ప్రతాపరుద్రదేవుడును, దోరసముద్రములో హొయ్సల చక్రవర్తి మూడవ నరసింహుని కొడుకు మూడవ బల్లాళుఁడును నేలుచుండు నప్పుడు అనఁగా సుమారు క్రీ. శ. ౧౨౯౦.౧౩౦౦ లో దన కావ్యములను రచించెననియు గెరెయ పద్మరస హరీశ్వరులు ఈ బల్లాళుని సభయందుండిరనియు నీ ముగ్వురు కవులు సుమారు క్రీ. శ. ౧౩౦౦ ల లోకాంతరగతులైరనియు మనము చెప్ప వచ్చును.[1]

ఆంధ్రపాఠకుల కపరిచితములగుటచే నీ సందర్భమున కన్నడ వాఙ్మయ పరిశోధకుల యభిప్రాయములను సుదీర్ఘములైనను అనువదింపవలసివచ్చినది. శ్రీ ఆర్. నరసింహాచార్యుల వారి కాలనిర్ణయము సరియైనది కాదు. ఏలనఁగా ౧. "నరసింహ బల్లాళ" యను పేరునకు హొయ్సల ప్రథమ నరసింహుఁడని వారు చెప్పిన యర్థ మొప్పుకొనదగినది కాదు. నరసింహబల్లాళుఁడనఁగా డాక్టరు వెంకటసుబ్బయ్యగారు చెప్పినట్లు నరసింహుని పుత్రుఁడు బల్లాళుఁడని యర్థము జేసికొనవలయును.[2] కావున పద్మరాజపురాణములలో బేర్కొనఁబడిన నరసింహ బల్లాళుఁడు డాక్టరు వెంకటసుబ్బయ్యగారన్నట్లు మొదటి నరసింహుని పుత్రుఁడైన రెండవ లేక వీరబల్లాళుఁడైనను, మూడః

1. కెలవు కన్నడ కవిగళ జీవన కాలవిచార. పుటలు. ౨౬౦-౨౬౬.

2. "నరసింహకృష్ణరాయా" యనుమాటలకు నరసింహుని (నరస నాయకుని) కుమారుఁడగు కృష్ణ రాయలనియర్థము జేసికొనునట్లు నరసింహు పుత్రుఁడగు బల్లాళుఁడనియే గ్రహింప వలెను.

నరసింహుని పుత్రుఁడైన మూడవ బల్లాళుఁడైనను గావచ్చును. వీరలలో నెవ్వని పద్మణాంకుఁ డుద్దేశించి "శ్రీవిపుళ నరసింహ బల్లాళభూమి పం" అను షట్పది పాదమును జెప్పెనో నిర్ణయించుట సులభసాధ్యముగాదు. వీరిరువురలో నెవ్వరికిని పద్మణాంకుఁడు పేర్కొనిన బిట్టి దేవరాయ లను పుత్రుడు లేడు. కావున నరసింహాచార్యులవారది వీరబల్లాళునికి నామాంతరమని చెప్పి శాసనసాక్ష్యమును చూపినారు; కాని వెంకటసుబ్బయ్యగారు విష్ణువర్ధనుని యనంతరము రాజ్యము జేసిన హొయ్సలుల కందఱకును విష్ణువర్ధననామము బిరుదాయెనని చెప్పి యందుకు దార్కాణముగ శాసనముల నుదాహరించినారు. పద్మణాంకుఁడు పేర్కొన్న బిట్టిదేవరాయఁడు ముమ్మడి బల్లాళుని పుత్రుఁడైన నాల్మడి బల్లాళుఁడగునని గుర్తించినారు. కాని రాఘవాంకచారిత్ర భైరవేశ్వరకావ్యకథాసూత్రరత్నావళులందు కెరెయ పద్మరసుని సమకాలికుఁడయిన రాఘవాంకుఁడు పంపాపురరాజగు దేవరాజుయొక్కయు నోరుగంటి ప్రతాపరుద్రునియొక్కయు నాస్థానమునకు బోయినట్లు చెప్పియుండుటవలన రాఘవాంకుఁడును గెరెయ పద్మరసును క్రీ. శ. ౧౩-వ శతాబ్దాంతమునను ౧౪-వ శతాబ్దప్రారంభమునను వెలసియుండిరని తోఁచుచున్నది. ఏలన పంపాపురమున ముమ్మడి బల్లాళుని దినములలో దప్ప అంతకుముందు స్వతంత్ర రాజ్యమేర్పడలేదు. రాఘవాంకుని కాలమున నచట రాజ్యము నేయుచుండిన దేవరాజు క్రీ. శ. ౧౩౦౦-౧౩౨౬ ల మధ్య నచట రాజ్యము నేయుచుండిన కంపిలిదేవరాయలే కాని యన్యుడు గాడు.

కెరెయ పద్మరసును నతని సమకాలికుఁడైన హరీశ్వరుని సోమరాజు స్తుతించెననియు మల్లికార్జునుఁడు దనసూక్తిసుధార్ణవములో నతని గిరిజాకల్యాణములోనుండి పెక్కుపద్యములను గైకొనెననియు నరసింహాచార్యులవారు వ్రాసినారు. కాని సోమరాజు క్రీ. శ. ౧౬ వ శతాబ్దము వాడనియు మల్లికార్జునుడు తనసూక్తి సుధార్ణవమును క్రీ. శ. ౧౨౬౩న రచించెననియు డాక్టరు వెంకటసుబ్బయ్యగారు శాసనసాక్ష్యమువలన నిరూపించినారు. [1]కావున కెరెయ పద్మరసు తన సమకాలికులైన హరీశ్వర రాఘవాంకాదులవలె క్రీ. శ. ౧౩౦౦ ప్రాంతమున నుండెనని చెప్పుట యొప్పును. అతని మనుమఁడైన విశ్వారాధ్యుఁడు ౧౩౫౦-౬౦ ప్రాంతమువాడని దృఢముగఁజెప్పవచ్చును. పాలకురికి సోమనాథకృత బసవపురాణ పండితారాధ్య చరిత్రాదులు మత గ్రంథములగుటవలన నవి యత్యంత స్వల్ప కాలముననె కర్ణాటకసంస్కృత భాషలలోనికి బరివర్తనమగుట యొక వింత కాదు.

## ఆ. రుద్ర ప్రతాపరుద్రులు

పిడుపర్తి సోమనాథుఁడు పేర్కొనిన ప్రతాపరుద్రుఁడు క్రీ. శ. ౧౧౬౩ నుండి ౧౧౯౬ దాక పాలించిన కాకతి రుద్రదేవుఁడగునా? పద్య బసవ పురాణావతారికయందు వివరింపఁబడిన చరిత్రాంశములనుబట్టి చూడగా ప్రతాపరుద్రుఁడు గాకతిరుద్రుఁడు గాజాలఁడని తోఁచుచున్నది. కాకతి రుద్రునకు బ్రతాప రుద్రుఁడను పేరులేదు. వాఙ్మయ పరిశోధకుల

1. కెలవుకన్నడ కవిగళ జీవన కాలవిచార. పుటలు ౧౮౨-౧౮౯, ౨౧౯-౨౨౭.

పోకడల గాంచి కీ. శే. కంభంపాటి అప్పన్నశాస్త్రులవారు తమ యసమ్మతి నిట్లు తెలిపియున్నారు. "కాకతి రుద్రదేవునికి బ్రతాప రుద్రుడన్న పేరు చరిత్రకారు లెట్లు ప్రయోగించుచు వచ్చిరో కాని యతని నాపేరుతో బిలుచు నొక శాసనమైనను లేదు. వాఙ్మయమందును నెక్కడను గానము. లోకములో మిక్కిలి ప్రసిద్ధిగాంచి యాపేరు జెప్పుకొనెడివాఁడు ముమ్మ డాంబా తనయుఁడైన వీరప్రతాపరుద్ర మహారాజే కావున రుద్రదేవుడనిన రెండవ వాడేయని భ్రమ లోకులకు గలుగ వచ్చునను కారణమున గాబోలు మొదటి ప్రతాపరుద్రుడని చరిత్రకారులు రుద్రదేవ మహారాజును బిలుచుటకు గడంగిరని యూహింప దగియున్నది."[1] అప్పనశాస్త్రుల వారన్నట్లు కాకతి రుద్రునకు బ్రతాపరుద్రుఁడను పేరులేదు. కలదని వాదించుచు దమ వాదమును నిలఁబెట్టుటకై బండారు తమ్మయ్యగారు వాఙ్మయమునుండియు శాసనములనుండియు బ్రమాణములను రెంటిని జూపియున్నారు గదా. ఈ ప్రమాణముల సత్త యెట్టిదో కనుగొందము. మొదటి ప్రమాణము, బద్దెన నీతిశాస్త్ర ముక్తావళిలోనిదని వీరనుకొను "పరువడినాంధ్రభాష గల బద్దెన నీతియు" నను పద్యము. తమ్మయ్యగారీ పద్యమును బద్దెన కెట్లంటగట్టిరో కాని దాని జదివి చూచిన నది బద్దెన కృతముగా దని చెప్పవలసి యున్నది. మొట్టమొదట నీతిశాస్త్రముక్తావళిని వెలువరించి యాంధ్రలోకమునకు బ్రసాదించిన శ్రీమానపల్లి రామకృష్ణకవిగారీ పద్యమును మూలగ్రంథమునందు జేర్పక దాని కనుబంధముగ గ్రంథాంతమున బ్రకటించి దానిఁగూర్చి

1. వేయి స్తంభాల గుడి శాసనము. పుట ౪౫.

యిట్లు చెప్పియున్నారు. ఇవి "శ్రీ ఆత్మకూరి సంస్థానాధీశ్వరుల వారి ప్రతిలోనున్న యధిక పద్యములు. ఇవి మా నాలుగు ప్రతులలోను లేవు."[1]

ఆ ప్రతి ప్రారంభమున నీక్రింది రెండుపద్యములు గలవని చెప్పినారు.

సీ. రాజనీతియు నసద్రాజ లక్షణమును
మంత్రిమార్గంబు దుర్మంత్రివిధము
నధికార విధియుఁ గార్యవిచారము
నుపాయగతియును రాజ్యరక్షాక్రమంబు
నిల నరాజకవృత్తి హితసేవక స్థితి
దుస్సేవక క్రియ దుష్టరాజ
సేవా బలము దానశీలతామహిమ వి
వేక సంగతియును లోకనీతి
పద్ధతులు చేసి భువి నతి ప్రజ్ఞవెలయ
బద్దెనీతియుఁ గోమటి పడుచు నోళ్ల
కతన దబ్బరపాఠంబు గదియఁ గవులు
తప్పు లెడలింప నెంతయు నొప్పు భువిని.

చ. పరువడి నాంధ్రభాషగల బద్దెన నీతియు సంస్కృతంబులో
బరగఁ బ్రతాప రుద్ర నరపాలునిచే రచియింపబడ్డ యా
నరవరు నీతి సారము వినం జదువంగడు మంచి దంచు జె
చ్చెరఁ గవి నీతి పద్ధతులు జేసె వినోదము బాలబోధకున్.

ఈ పద్యములు బద్దెన కృతములుగావనియు బద్దెనకును ప్రతాప రుద్రునికిని దరువాతివాడగు కవి యెవ్వఁడో బద్దె నీతి

1. విస్మృత కవులు, నెం. 3 రు. పుట ౨౫.

యందు కోమటి పడుచుల నోళ్లఁబడి దబ్బర పాఠములు గదిసి యుండఁగా దానియందలి తప్పులెడలించుట యొప్పని యట్లు చేసి, బద్దెన నీతియు ప్రతాప రుద్రుని నీతి సారమును వినం జదువంగడు మంచిదంచు వాని బడి బాలబోధము వినోద కరమగునట్లు "నీతి పద్ధతులు" అను గ్రంథమును రచించెననియు దెల్లమగుచున్నది. ఆ కవి యెవ్వడును ప్రశ్న రావచ్చును. అతని నీతిపద్ధతులు లభించినయెడల నందువలన నతని పేరు వ్యక్తము గాగలదు. ఆత్మకూరి ప్రతిని వ్రాసిన వ్రాయసకాడు దత్ప్రతికి బీఠికగా నుదాహరించిన పై రెండు పద్యములలోఁ గవి పేరు లేకపోవుట వింత కాదు. ఇది యెట్లున్నను ఆ కవి నామమిచ్చుట ప్రస్తుతము గాదు. పై పద్యములను రచించి నాతఁడు బద్దెన కాడనియు నతని కంటె భిన్నుఁడనియు, నతని కంటెను ప్రతాపరుద్రుని కంటెను నర్వాచీనుఁడనియు నిరూపించుటయే ప్రధానోద్దేశమనియు దెలియనగును. కావున పరువడినాంధ్ర భాషయను పద్యము నాధారము జేసికొని కాకతి రుద్రునికి ప్రతాపరుద్రుఁడను పేరు గలదని సాధింపఁ గడగుట వ్యర్థ ప్రయత్నము.

ఇక తమ్మయ్యగారు చూపిన శాసన సాక్ష్య మెట్టిదో పరికింతము. ఇది యాద్యంతములు లేనిది, శాసనమునందు కాలము లేదు. కొండవీటి దండకవిలె నుండి తమ్మయ్యగారీ యమూల్యమైన శాసమును బట్టి తెచ్చిరి.

"సోమనారాధ్య గురవే పిడుప ... రధ్ ... ద్వాలయ
ఆదౌ ప్రతాపరుద్రాఖ్యో భూపా ... ర్ ... కం"

ఇంక నేమి! సోమనారాధ్యుఁ డున్నాఁడు, ప్రతాప రుద్రుఁ డున్నాడు. సోమనారాధ్యుఁడు పాలకురికి సోమనాథుఁడే; ప్రతాపరుద్రుఁడు గాకతి రుద్రుఁడగుటకు సంశయమేమి?

"ఈశానసోహ్వాత్ముఁడైన సోమనాథుఁడు మన పాల కురికి సోమనాథుఁడే కాదగును. ప్రతాప రుద్రుఁడొసంగిన పిడు పర్తి నాతఁడు శివరాత్రి కొప్పయ్య మున్నగు శిష్యులకొసగి యుండును. ఆగ్రామమును బట్టియే తరువాత నీ వంశము వారికిఁ బిడుపర్తి యని గృహ నామమేర్పడెను. గుంటూరు మండలమున తెనాలి తాలూకాలో నిప్పుడొక "పిడుపఱ్ఱు" ఉన్నది. పిడుపర్తి సోమనాథకవి వంశ్యులగు పిడువర్తి రామ లింగయ్యగారు తమ పూర్వులకగ్రహారముగా నియ్యఁబడినదే యని నాకొకమాఱు తెలియఁబఱచిరి అని వివరించినారు.[1] దీని బట్టి చూడగా మొదటి ప్రతాపరుద్రుఁడు పాలకురికి సోమ నాథునికి గుంటూరు మండలము తెనాలి తాలూకాలోని పిడు పర్తి నగ్రహారముగ నిచ్చెనని తమ్మయ్యగారి యభిప్రాయమైనట్లు తోచుచున్నది. కథ బహుంపసందుగానే కుదిరినది; కాని యడ్డము దిరిగినది. వారి ప్రథమ ప్రతాపరుద్రుని యేలుబడి క్రింది రాష్ట్రము కృష్ణా నది దక్షిణపు దరి నెన్నడును దాకలేదు. గుంటూరుమండలమును తెనాలి తాలూకాయును నప్పుడు వెలనాటి రాజుల యేలుబడి క్రిందనుండినవి. గణపతిదేవుని రాజ్యమధ్యకాలమువఱకును గాకతీయుల యధికారమున కాప్రాంతమున జెల్లుబడి కలుగలేదు. కావున తమ్మయ్యగారి మొదటి ప్రతాపరుద్రుడు పిడుపఱ్ఱును పాలకురికి సోమనాథుని

1. పాలకురికి సోమనాథకవి. పుట ౧౦౩.

కగ్రహారముగానిచ్చుట యసంభవము. కావున పై శాసనమున పేర్కొనబడియుండు ప్రతాపరుద్రుఁడు క్రీ. శ. ౧౨౯౫ నుండి ౧౩౨౩ దాక సర్వాంధ్రదేశమున కధిపతియైన ప్రతాపరుద్రుఁడే కావలయును. అగునేని యందలి సోమనారాధ్యుఁడు పాల్కురికి సోమనాథుఁడేయని తమ్మయ్యగారు చేసిన వ్యక్త్యైకీరణము నంగీకరించిన యెడల నతఁడీ ప్రతాపరుద్రుని సమకాలికుడే కావలయును.

శ్రీ తమ్మయ్యగారిట్లు కాకతి రుద్రునకు బ్రతాపరుద్రుఁడను నామాంతరముగలదని నిరూపించుటకు సాధనములను వెదకుచుండఁగా శ్రీ నిడదవోలు వెంకట్రావుగారు క్రొత్త ప్రతాపరుద్రు నొక్కని వెలువరించినారు. "ప్రతాపరుద్రుని పేరితో రుద్రమదేవి రాజ్యము సేయుచుండెననియు, నామెకు మంత్రి శివదేవయ్య బసవన్న కథను క్రీ. శ. ౧౨౬౦ సం॥ నకు ముందు చెప్పెననియు, తెనుగున బసవన్న కథను మొదట రచించి నాతఁడు పాల్కురికి సోమనాథుఁడేయగుటచే నప్పటికే యతని బసవపురాణము వ్యాప్తిలోనుండెననియు వెంకట్రావుగారి వాదము. ఇది కేవల మసంగతము. ౧. రుద్రాంబకు ప్రతాపరుద్రుఁడను పేరు లేదు. ఆమె శాసనములు పెక్కింటి యందామె రుద్రదేవుఁడనియే పేర్కొనబడియున్నది. కాని ప్రతాపరుద్రుఁడను పేరెందును గానరాదు. ౨. శాసనములను బట్టి చూడగా రుద్రమదేవి పాలన క్రీ. శ. ౧౨౬౦ సం॥ నుండియే ప్రారంభమైనట్లు తెలియుచున్నది. కాని యామెతండ్రి గణపతిదేవుని శాసనములు ౧౨౬౨ వఱకును గానవచ్చుచుండుటచేత గణపతిదేవుఁడు నిజమరణమునకు రెండేండ్లకు ముందు రాజ్యమున

కాఁమెను వారసురాలినిగ నంగీకరించి యౌవరాజ్యమున నభిషిక్తురాలిని గావించెనని చరిత్రకారుల యభిప్రాయపడుచున్నారు. కావున క్రీ. శ. ౧౨౬౦ కి ముందామె రాజ్యము సేయుట యసంభవము. 3. శివదేవయ్య యొకవేళ రుద్రమదేవికి బసవన్న కథను జెప్పియుండెనని యొప్పుకొన్నను నది పాలకురికి సోమనాథకృత బసవపురాణమే యని నిర్ధారించి చెప్పుటకు వలను పడదు. బసవన్న కథ సోమనాథునిచే గల్పింపబడినది కాదు. భక్తులనడిగి తెలిసికొని వారు చెప్పిన బసవన్న కథలను బురాతన గీతార్థసమితియు మాతృకగా బసవపురాణమును రచించితినని సోమనాథుఁడే చెప్పుకొనియున్నాడు. కావున శివదేవయ్య చెప్పిన కథ యతనికాలమున జన సామాన్యమున బ్రచారమందుండిన కథ కావచ్చును. అది సోమనాథుని రచనయే యని చెప్పవలసిన యావశ్యకత లేదు. కావున తమ్మయ్యగారు గాని యితరులు గాని వాదించునట్లు పిడుపర్తి సోమనాథుఁడు పేర్కొనిన ప్రతాపరుద్రుఁడు కాకతి రుద్రుఁడు కాజాలడు. వెంకట్రావుగారు వక్కాణించునట్లు రుద్రమదేవి ప్రతాపరుద్రుడను పేరితో రాజ్యము సేయనులేదు. ఆతఁడు రుద్రాంబ దౌహిత్రుఁడును ముమ్మడమ్మ పుత్రుఁడును క్రీ. శ. ౧౨౯౫ నుండి ౧3౨3 దాక కాకతీయ సామ్రాజ్యము నేలిన ప్రతాపరుద్రుఁడే కావలయును. పద్య బసవపురాణములోని సోమనాథోదంతమున జెప్పియుండు నీ క్రింది యంశములు పై తీర్మానమె సరియైనదని సూచించుచున్నవి:—

౧. ఆ ప్రతాపునిరాజధాని యోరుగల్లు:—

"ఒకనాఁడు శివభక్తులోరుగంటను స్వయం
భూదేవు మంటపమున వసించి
బసవ పురాణంబు పాటించి విను వేళ
హరుని గొల్వ ప్రతాపుఁడచటికేగి"
"అది విని దూషకావళులు నాపురియేలు
ప్రతాపుడున్"

అను పిడుపర్తి సోమనాథుని వాక్యము లిందుకు తార్కాణ. కాకతిరుద్రుని రాజధానియనుమకొండ, ఓరుగల్లప్పటికింకను నిర్మాణము గాలేదు. గణపతి దానినిర్మాత, కావున యోరుగంటిలోని స్వయంభూనాథుని దేవాలయమునకు హరుని గొల్వబోవుట యసంభవము. రుద్రాంబ దౌహిత్రుఁడగు ప్రతాపరుద్రుని కాలమున నది సుప్రసిద్ధ మహానగరమై కాకతి సామ్రాజ్యమునకు రాజధానియై చెన్నెసలారియుండినది. కావున పిడుపర్తి సోమనాథుఁడు వర్ణించి యుండు పాల్కురికి సోమనాథుని వృత్తాంతము వాస్తవముగ నడచియుండిన నది రుద్రాంబ దౌహిత్రుని కాలముననే నడచియుండవలయును.

౨. "సోమేశ్వరుండు కాలత్రయవేది గావున......ఈ దేశం బింక తురుష్కాక్రాంతము గాఁగలదు. మాబోటి నియమస్థుల కిందునికి పొందు పడదు" అని పాల్కురికి సోమనాథుఁడు పల్కినట్లు పద్య బసవపురాణమున గలదు గదా. దేశము తురుష్కాక్రాంతమైనది క్రీ. శ. ౧౩౨౩ వ వర్షమునందు. అప్పుడు రాజ్యము సేయుచున్నాతఁడు రుద్రాంబ దౌహిత్రుఁడు ప్రతాపరుద్రుఁడే కాని కాకతి రుద్రుఁడు గాఁడు.

3. పాల్కురికి సోమనాథు శిష్యుడైన ఇందులూరి యన్నయ ప్రతాప రుద్రునిమంత్రియని,

“తనశిష్యుఁడును నా ప్రతాపుని మంత్రియు,
నగు నిందులూరి యన్నయను బిల్వ
బనిచి”

యను వాక్యమువలన దెల్లమగుచున్నది. ఇందులూరి అన్నయ్య రుద్రాంబ రెండవ కుమార్తెయగు రయ్యమయొక్క భర్త; రుద్రమ్మ మనుమఁడును నామె వెనుక కాకతీయ్య సింహాసనము నధిష్ఠించిన ప్రతాపరుద్రునికి బినతండ్రి. ఇతఁడు ప్రతాపరుద్రుని యాస్థానమున గజసాహిణియై మహమ్మదీయ దండయాత్రలను బ్రతిఘటించి పోరు సల్పెను. ఇతని శాసనములు గొన్ని కలవు. ఇందు మూఁడు ముఖ్యముగ నిచట గమనింపదగినవి. ఒకటి శకాబ్దము ౧౨౧౩ కు సరియైన క్రీ. శ. ౧౨౯౧-వ సంవత్సరమున మహాప్రధాన ఇందులూరు గన్నయ ప్రధానుల కుమారుఁడగు నన్నల దేవుడు త్రిపురాంతకేశ్వరున కఖండ దీపారాధన నిమిత్తము ఏబది యావులను దానము జేసినట్లు తెల్పుచున్నది.[1] శకాబ్దము ౧౨౧౫ నకు సరియైన క్రీ. శ. ౧౨౯౩ నాఁడు ఇందులూరి గన్నయ ప్రధాని కొడుకు అన్నయ ప్రధాని భీమేశ్వరమహాదేవునికి జేసిన దానము దెల్పు శాసనమొక్కటి దాక్షారామమున గలదు.[2] మఱియొకటి తూర్పుగోదావరి జిల్లా పలివెలయందలి కొప్పేశ్వర స్వామివారికి గాకతీయ ప్రతాప రుద్రదేవ మహారాజు రాజ్యము సేయుచుండఁగా శకా

1. ARE 238 of 1905
2. S S I. IV. 1307

బ్దము ౧౨౩౯ అనగా క్రీ. శ. ౧౩౧౭ వ సంవత్సరమున అన్నయ ప్రెగడగారి యభ్యుదయము కొఱకు అతని భృత్యుం డొనర్చిన దానమును వివరించుచున్నది.[1] శ్రీమల్లంపల్లి సోమశేఖర శర్మగారు చెప్పినట్లు ఇందు బేర్కొనబడిన యన్నయ ప్రెగ్గడ ఇందులూరి యన్నయ ప్రెగ్గడ కాఁదగును.[2] అగునేని పై శాసనములవలన నిందులూరి అన్నయ మంత్రి క్రీ. శ. ౧౨౯౧ మొదలు ౧౩౧౭ వఱకును వర్థిల్లెనని నిర్థారితమగుచున్నది.

ఇట్లు పిడుపర్తి సోమనాథుఁడు చెప్పిన పాల్కురికి సోమనాథుని వృత్తాంతమున బేర్కొనఁబడిన చరిత్రాంశములన్నియు బ్రతాపరుద్రునికి జక్కగ నన్వయించుచున్నవి. అందొక్కటియైన రుద్రునకు సరిపోదు. అయినను బిడుపర్తి సోమనాథుఁడు వినికిళ్లనుబట్టి వ్రాసెను; కావున నతఁడు చెప్పువృత్తాంతము విశ్వాసపాత్రము గాదని నిరసించిన విమర్శక శిఖామణు లావృత్తాంతమునే కాకతి రుద్రునికి బ్రతాపరుద్రుఁడని నామకరణము గావించి దిగమ్రింగబూనుట చిత్రము గదా!

## ౩. పాల్కురికి సోమనాథుఁడు—అతని సమకాలికులు

౧. మల్లికార్జున పండితారాధ్య శిష్య, పుత్రాదులు:— ప్రభాకరశాస్త్రులవారు పాల్కురికి సోమనాథుని, పండితారాధ్య చరిత్ర రచనాకాలమునకు బండితారాధ్యులవారి శిష్యుఁడును బుత్రుఁడును సజీవులైయున్నారనియు మనుమలు పేర్వెలయు

---

1. SII. V. 110.
2. భారతి, తారణ, పుట౧౦౭.

చున్నారనియు దీనివలన నేర్పడుచున్నదని వ్రాసిరి. శ్రీబండారు తమ్మయ్యగారికిని కొంచె మించుమించుగ నిట్టియభిప్రాయమే గలదు. వీరియభిప్రాయము బడి దోనమయ్య కేదారయ్యలే కాక మనుమ పండిత భీమన పండిత మహాదేవ చెన్నమయ్యలంద ఱును పాల్కురికి సోమనాథునికి సమకాలికులగుచున్నారు. ఇది పండితారాధ్య చరిత్రలో జెప్పినదానికి ప్రత్యక్షము విరుద్ధముగ నున్నది. అందు మల్లికార్జున పండితారాధ్యులు లింగైక్యమును జెందిన పిమ్మట నతని శిష్యుఁడైన దోనమయ్య యతని పెద్ద కొడుకగు గేదారయ్యకు లోకారాధ్య పట్టముగట్టెననియు, నత డనర్గళభక్తి సామ్రాజ్యము సేయుచుండెననియు, నతనికి మనుమ పండిత భీమన పండిత మహాదేవయ్య చెన్నమయ్యలను నలుగురు పుత్రులు గల్గిరనియు, వారికి తనయ పరంపరోత్తర పరంపరలు గల్గెననియు జెప్పియున్నది. మఱియు గేదారయ్య గారి శిష్య సంతానము సముద్రమధ్యమున నాయక రత్నము వలె నివటూరి సోమనాథయ్య వెలుంగుచుండెననియు, నతనికి సూరీశ్వరుఁడు లోకారాధ్య పదవిహారుఁడైన విశ్వనాథప్పయ్య గారు సింగణమంచిగారునను పుత్రులు ముప్వురు గల్గిరనియు, వారి తనయ తత్తనయ పరంపరలు దేజరిల్లుచుండెననియు నుక్తమై యున్నది. ఇంత కథను వివరించి చెప్పిన పాల్కురికి సోమనాథుఁడు వారందఱికిని దరువాత వర్ధిలెనని యెంచుట సమంజసము. కావుననే డాక్టరు చిలుకూరి నారాయణరావు గారు ప్రభాకర శాస్త్రులవారి సిద్ధాంతము నిట్లు ఖండించినారు. "ఇట్లు చెప్పడం సమంజసము కాదని తోస్తుంది. పండితారాధ్య చరిత్రోప సంహార వాక్యములలో కేదారయ్య పుత్రులు నలు

గురి "ఆత్మసంతాన తనయ పరంపరోత్తర పరంపరలుఁ బరిచిత గురుపరంపర దేజరిల్లు" అని చెప్పబడియున్నది. అంటే, వారి తరువాత అనేక తరములు గడచినవని అర్థము వస్తుందిగాని, సోముని కాలములో వారున్నారని చెప్ప వీలులేదు. అట్టి, "శైవ సంతాన విమలాంబునిధిమధ్య విభ్రమానర్ఘ్య నాయక రత్నమై" ఒప్పారు ఇవటూరు సోమనాథయ్యగారి ముగ్గురు పుత్రులయిన సూరీశ్వరుఁడు, విశ్వనాథప్పయ్యగారు సింగణ మంచిగారు గురు త్రితయముగా పేరు పొందినారు. ఆ "గురు త్రితయాన్వయ తనయ తనయ పరంపరోత్తర పరంపరలుఁ బ్రభుతర గురుపరంపర దేజరిల్లె" అంటె సోమనాథునికిన్ని పండితారాధ్యునికిన్ని మధ్య చాలా తరముల అంతరమున్నదని సుస్పష్టమవుతున్నది.[1]

డాక్టరు నారాయణరావుగారు చెప్పినదెంతయు నొప్పిదమై యున్నది; కేదారయ్య గతించిన పిమ్మటనె పండితారాధ్య చరిత్ర విరచింపఁబడెననియందె సాక్ష్యము కలదు. పండితారాధ్యులు లింగైక్యము నందిన పిమ్మట దోనమయ్య కేదారయ్యను లోకారాధ్యపదమునకుఁబట్టాభిషిక్తుని గావించెనని సోమనాథుఁడు చెప్పియున్నాడు కదా; ఇతని యనంతరము యే కారణముచేతనో తెలియదు అతని పుత్రులెవ్వరును తత్పథమున కభిషిక్తులు కాలేదు. ఇవటూరి సోమనాథుని పుత్రులలో మధ్యముఁడగు విశ్వనాథప్పయ్య కేదారయ్యయొక్క లోకారాధ్యపదమునకు బట్టాభిషిక్తుఁడాయెను. కావున నందువలన కేదారయ్య మరణమును నటుపిమ్మట నడచిన విశ్వనాథప్పయ్య పట్టాభిషేకమును బండితా

---

1. పండితారాధ్య చరిత్ర, ఉపోద్ఘాతము, పుటలు, ౧౬-౧౭.

రాధ్య చరిత్ర రచనకు ముందు సంభవించిన చరిత్రాంశములని తెల్లమగుచున్నది. విశ్వనాథప్పయ్య క్రీ. శ. ౧3 వ శతాబ్ద మధ్యమున వర్ధిల్లెనని దృఢముగ జెప్పవచ్చును. ఎట్లనఁగా, శకాబ్దము ౧౧3౭ కు సరియైన క్రీ. శ. ౧౨౧౬ న రేచెర్ల పిల్లల మఱ్ఱి చేతిరెడ్డి భార్య యొక్క సానమ్మ వ్రాయించిన శాసనమున ఇవటూరి సోమయ పేర్కొనబడి యున్నాఁడు.[1] ఇందలి యివటూరి సోమయయే పండితారాధ్య చరిత్రలోని ఇవటూరి సోమనాథుఁడనుటకు సంశయము లేదు. కావున నివటూరి సోమనాథుఁడును నతని గురువగు కేదారయ్యయు ౧3 వ శతాబ్ద ద్వితీయ దశకమున నుండిరని మనము నిశ్చయింపవచ్చును; క్రీ. శ. ౧౨౨౦ ప్రాంతమున నతఁడు కైలాసవాసి కాగా నతని శిష్య పుత్రుడైన ఇవటూరి విశ్వనాథప్పయ్య లోకారాధ్య పదమునకభిషిక్తుడై క్రీ. శ. ౧౨౭౫ వఱకును భక్తి సామ్రాజ్యమును బాలించియుండ వచ్చును. విశ్వనాథప్పయ్య తనయ తనయ పరంపరోత్తర పరంపరలను స్మరించిన పాల్కురికి సోమనాథుఁడు విశ్వనాథప్పయ్యకు గనీసము రెండు తరముల తరువాతి వాడు కావలయును. తరమున కిరువదియైదేండ్ల చొప్పున లెక్కించినను నతని కాలము క్రీ. శ. ౧౨౯౫ నకు దరువాత నని తేలుచున్నది. క్రీ. శ. ౧౪ వ శతాబ్ద ప్రారంభమున నతడు వర్ధిలెనని నిస్సందేహముగ జెప్పవచ్చును.

---

1. Corpus of Telingana Inscriptions No. 42.
ఈశాసనమును జూపి యందలి యివటూరి సోమయయే ఇవటూరి సోమనాథుఁడని నాకు దెల్పిన మిత్రులు శ్రీమల్లంపల్లి సోమశేఖరశర్మగారికి కృతజ్ఞుఁడను.

౨. గురువులు:—పై బేర్కొనఁబడిన దోనమయ్య, కేదారయ్యలు గాక సోమనాథుని సమకాలికులలో బరిగణింపఁ బడువారు మఱికొందఱు గలరు. ఇందు మొదట జెప్పదగినవాఁడు బెలిదేవి వేమనారాధ్యుని మనుమఁడు. సోమనాథుఁడు తాను "పేరెన్నఁబడిన శ్రీబెలిదేవి వేమనారాధ్యులను పరమారాధ్య దేవు మనుమని శిష్యుండ" నని చెప్పుకొనియున్నాఁడు. ఈ మనుమఁడగస్త్యభ్రాతవలె నూరు పేరు లేనివాఁడుగ గన్పట్టుచున్నాఁడు. ఇతఁడు గురులింగాహ్వయుఁడని ప్రభాకర శాస్త్రులవారు చెప్పి తమయభిప్రాయమున కాధారముగ "గురులింగ వరకరోదరజనితుండ," "గురులింగ తనూజుండ" అను పండితారాధ్య చరిత్ర, బసవ పురాణములలోని వాక్యములను దాహరించి వానికి బ్రాపుగ

"బెల్దేవి వేమనారాధ్య ప్రశిష్య స్వాకృపానిధేః
గురులింగార్య స్యదయాహస్త గర్భసముద్భవః"

అను శ్లోకమును టంకించినారు.[1] కాని శైవపండితులు శాస్త్రులవారి నామకరణము నంగీకరింపరు. శ్రీ బండారు తమ్మయ్యగారు ఆ "మనుమని" నామమును గాని, గురుత్వ స్వరూపమును గాని వివరింప లేదు. బెలిదేవ వేమనారాధ్యుఁడు లింగధారి బ్రాహ్మణుఁడని పండితారాధ్య చరిత్రమున బురాతన ప్రకరణమున వర్ణితమైన యాతని చరిత్రమునుబట్టి స్థూలదృష్టికి గానవగును. ఈ వేమారాధ్యుని వంశ్యులమని చెప్పుకొనెడియారాధ్య బ్రాహ్మణులు కొందఱు నేఁడు గలరు. అతని మనుమఁడు సోమనాథుని విద్యాగురువులలో నొకఁడై యుండును. అని వక్కా—

1. బసవపురాణ పీఠిక, పుట ౧౮.

ణించినారు.[1] శ్రీ నిడదవోలు వెంకట్రావుగారును వీరి మార్గమునె యనుసరించిరి.[2] కాని పాల్కురికి సోమనాథుఁడు తన గురువును పేర్కొనక పోవునా? యను సంశయము బాధించుచున్నది. అతఁడు గురు లింగార్యుఁడైనను గాక పోయినను నతని పేరు ప్రధానము గాదు. బెల్దేవి వేమనారాధ్యుని మనుమఁడనుటయే ముఖ్యాంశము. ఏలనఁగా వేమనారాధ్యుఁడు మల్లికార్జున పండితారాధ్యుల సమకాలికుఁడు. అతని మనుమని శిష్యుఁడైన పాలకురికి సోమనాథుఁడు మల్లికార్జున పండితులకు దరువాతి వాఁడు కావలయును. పండితారాధ్యుని మరణ కాలమునుగూర్చి కొంత యభిప్రాయ భేదము గలదు. ఒక్క డాక్టరు చిలుకూరి నారాయణరావుగారు తప్ప తక్కిన వారందఱును మల్లికార్జున పండితారాధ్యులకును పాలకురికి సోమనాథునికిని మధ్య రెండు తరముల యెడమే కలదని నిశ్చయించి యా ప్రకారము సోమనాథుని కాలము నుజ్జాయించుచున్నారు. ఇది పండితారాధ్య చరిత్ర సాక్ష్యమును ప్రతిఘటించు చున్నది. కాని డాక్టరు నారాయణరావుగారు తలచినట్లు మల్లికార్జున పండితుని సమకాలికుఁడగు వేమనారాధ్యుఁడును పాలకురికి సోముని గురువుయొక్క తాతయగు వేమనారాధ్యుఁడును భిన్నవ్యక్తులని యనుకొన నవసరము లేదు. బెలిదేవి వేమనారాధ్యుని మనుమని శిష్యుండనుచోట

---

1. పాలకురికి సోమనాథ కవి, పుట, ౭౯.

2. బసవపురాణపీఠిక పుట 3౨. "ఈ గురు ప్రశంసయొక్క పండితారాధ్యుల చరిత్రలో దప్ప తదితర గ్రంథములలో గాన్పించదు." అని శ్రీ వెంకట్రావుగారు నొక్కిచెప్పినారు. ఇది నిజమా? "గురు లింగ వరకరోదర జనితుండ" నను బసవపురాణ వాక్యమున కేమి జవాబు?

"మనుమ" శబ్దమునకు బౌత్త్రుఁడనియె యర్థము జెప్పుకొనవలసిన యక్కరలేదు. "మనుమ" శబ్దమును వంశజుడను నర్థమున గూడ ప్రాచీనులు వాడియున్నారు. ఒక యుదాహరణము:—

"శరధి గట్టించి రాక్షసుని జయించి
చనిన శ్రీ రాఘవస్వామి మనుమండు
గరికాలవంశ శేఖరుఁడు జగదొబ్బ
గండండు పొత్తపి కామభూపతికి
ధరజ సీతకు నరుంధతి కెనయనఁగ
దగు శ్రీయాదేవికి దనయుండు ధర్మ
పరుఁడు ధీరుఁడు శత్రుభంజనుఁడావి
పతి త్రిభువన మల్లపార్థివేశ్వరుఁడు"[1]

ఏ వరుసక్రమమునననుసరించి "శరధి గట్టించి రాక్షసుని జయించి చనిన శ్రీ రాఘవస్వామి"కి ఆంధ్ర చోళ వంశజుడైన త్రిభువన మల్లుడు మనుమఁడాయెనో యావరుస నే పాల్కురికి సోమనాథునియొక్క గురువు బెద్దవి వేమనారాధ్యునికి మనుమఁడాయెను. ప్రభాకర శాస్త్రులవారు చెప్పునట్లు ప్రశిష్యుఁడై నప్పటికిని శిష్యుని శిష్యుఁడని యర్థము జెప్పుకొనవలసిన యావశ్యకత లేదు, శిష్యసంతతికి జెందినవాఁడని యర్థము జెప్పుకొనవచ్చును. కాబట్టి బెద్దవి వేమనారాధ్యుని మనుమని శిష్యుఁడనని సోమనాథుఁడు చెప్పిన వాక్యమతని కాలమును నిర్ణయించుటకు సహకారి కాజాలదు.

---

1. శాసన పద్య మంజరి, నెం. ౧౭ రు.

3. కరస్థలివారు:—

"సకృతాత్ముఁడగు కరస్థలి విశ్వనాథు
ప్రకటవర ప్రసాద కవిత్వయుతుఁడ",
"చరలింగ ఘన కరస్థలి విశ్వనాథ
వర కృపాంచితకవిత్వ స్ఫూర్తిఁ బేర్చి
చను బసవపురాణకథ......"

యను సోమనాథుని వాక్యములవలన కరస్థలి విశ్వనాథయ్య యాతని కవితా గురువని తెలియవచ్చుచున్నది. ఇతఁడు గాక కరస్థలి సోమనాథయ్య పాలకురికి సోమనాథుని సమకాలికులలో నొక్కఁడుగ బసవపురాణమున బేర్కొనబడియున్నాడు.

"జంగమ రత్నంబు శరణ సమ్మతుఁడు
లింగైక్యవర్తి గతాంగ వికారి
పండితారాధ్య కృపాసముద్గతుఁడు."

అని యతఁడు బ్రస్తుతింపఁబడినాడు. కాని యతనికి విశ్వనాథయ్య గారికే మైన సంబంధము గలదేమో తెల్పలేదు, అయినను శ్రీ బండారు తమ్మయ్యగారు వీరల కన్నదమ్ముల వావి గల్పించినారు. "సోమనాథుని కవితాగురుఁడగు విశ్వనాథునకీతఁ డగ్రజుఁడుగా నోపును, కావున నీ విశ్వనాథుఁడు గూడఁ ద్రిపురాంతక వాసియై యుండునని నేనూహించుచున్నాను. అతని యన్నకడ సోమనాథుఁడేమైన విద్యలనభ్యసించి యుండును" అని వక్కాణించినారు శ్రీ తమ్మయ్యగారు; [1]నిరాధారములగు వారి యూహాతరంగ పరంపరలపై మనము దేలియాడవలసిన యావ

1. పాలకురికి సోమనాథ కవి, పుటలు, ౭౦—౭౧.

శ్యకత లేదు, కాని యీ సోమనాథుఁడు మల్లికార్జున పండితారాధ్యుల శిష్యుఁడనియు, నతఁడు పాలకురికి సోమనాథునికి సమకాలికుడగుటచేత మల్లికార్జున పండితారాధ్యులకును పాలకురికి సోమనాథునకొక్క పురుషాంతరమునకంటె నెక్కువ యెడముండి యుండదనియుఁ బెక్కండ్రు పరిశోధకులుద్ఘాటించుచున్నారు. "“పండితారాధ్య కృపాసముద్గతుఁ” డని కలదు. పండితారాధ్యులవారి శిష్యుఁడనియేని, లేక తదనుగ్రహమువలన జనించిన వాఁడనియేని దానికర్థము. తచ్ఛిష్యుఁడనుటయే యుక్తతరము. పండితారాధ్యుఁడన మల్లికార్జున పండితారాధ్యుఁడే. ఆయన శిష్యుఁడయిన కరస్థలి సోమనాథయ్యకు పాల్కురికి సోమన సమకాలము వాఁడని దీనివలన నేర్పడుచున్నది' అని తీర్మానించినారు ప్రభాకర శాస్త్రులవారు.[1] మొత్తముమీఁద శాస్త్రుల గారితో నేకీభవించుచున్నను కొంత యభిప్రాయ భేదమును వెలిబుచ్చినారు, తమయ్యగారు. “ఆ కరస్థలి సోమనాథుఁడు 'పండితారాధ్య కృపాసముద్గతుఁడు' అని యందులోఁగలదు. దీని వలన నాతని దీక్షాగురువు పండితారాధ్యుఁడని వ్యక్తమగును. వీరశైవ పంచాచార్యులలోని చతుర్థాచార్యుని కలియుగ వ్యవహారనామము పండితారాధ్యుడని మనమిదివఱకే గుర్తించి యుంటిమి. అందుచేతఁ గరస్థలి సోమనాథుఁడా పండితారాధ్య పీఠమునకుఁ జెందిన శిష్యుఁడని కూడఁ దలంపనగును గాని, యంతకన్న నా కాలమందున్న మల్లికార్జున పండితారాధ్యుని వలన స్వయముగా లింగధారణ దీక్షవడసిన యాతని

1. బసవపురాణ పీఠిక, పుట, ౫.

దయాహ స్త గర్భ సముద్భవుఁడనుటయే సమంజసము!"[1]
పాలకురికి సోమనాథుని మల్లికార్జున పండితారాధ్యులకత్యంత
సన్నిహితునిగ నేయుటవలన వీరిట్లు చెప్పవలసివచ్చినది. పండి
తారాధ్య చరిత్రను బట్టి చూడ బాలకురికి సోమనాథుఁడు మల్లి
కార్జున పండితారాధ్యులకు వీరు చెప్పునట్లు సన్నిహితుఁడుగాఁ
డనియు వారిరువురికి మధ్య కనీస మైదుపురుషాంతరముల
యెడముఁగలదనియు దెలియుచున్నది. కావున సోమనాథుని
సమకాలికుఁడైన కరస్థలి సోమనాథుడు మల్లికార్జున పండితారా
ధ్యుల శిష్యుండై యుండజాలఁడు, "పండితారాధ్య కృపాసము
ద్ధతుఁ" డనగా బండితారాధ్యపీఠమునకు జెందిన శిష్యుడని
యర్థము జెప్పుకొనుటయె సరి. క్రీ. శ. ౧౫ వ శతాబ్దము
వాడైన విభూతి గవురయ పండితారాధ్యుల గృహదాసుఁడై
నట్లు, కరస్థలి సోమనాథయ్య పండితారాధ్య కృపాసముద్ధతుడై
యుండవచ్చును.

3. సోమనాథుని శిష్యులు:—శివరాత్రి కొప్పయ్య,
ఇందుఁలూరి యన్నయ మున్నగు పాలకురికి సోమనాథుని శిష్యులు
కొందఱు పద్య బసవ పురాణము మొదలగు నర్వాచీన వీర
శైవ గ్రంథముల యందు పేర్కొనబడియున్నారు. ఇందులూరి
అన్నయ రుద్రాంబ దౌహిత్రుడైన ప్రతాపరుద్ర మహారాజు
నకు మహాప్రధానియై క్రీ. శ. ౧౨౯౧ మొదలు ౧౩౦౭
వఱకు రాజకార్యములను నిర్వహించుచుండె నని శాసన
సాక్ష్యమువలన పూర్వప్రకరణమున రూపించి యున్నాడను.
కాని యిటీవల శ్రీ నిడదవోలు వెంకట్రావుగారు సోమనాథుని

1. పాలకురికి సోమనాథ కవి, పుట, ౯౯.

కొక నూతన శిష్యుని గుదిర్చినారు. క్రీ. శ. ౧౨౪౨ లో యథావాక్కుల అన్నమయ్య, సర్వేశ్వర స్తవమున నీతని స్తుతియించి యీతని గ్రంథములనుండి భావములను సంస్కరించి? తన గ్రంథమున జేర్చియున్నాఁడు." దీనికి తార్కాణముగ

"అభిరమ్యంబుగ దూదికొండ మహనీయారాధ్య సోమేశ్వర
ప్రభు కారుణ్య వసంత సంజనితమత్పద్య ప్రసూనావళిన్."

అను పద్యము నుదాహరించి,

"పై పద్యమున నారాధ్య సోమేశ్వరుఁ డన్నమయ్య గురువని యీవఱకు విమర్శకులు నిర్ణయించియున్నారు. ఈతఁడు పాల్కురికి సోమనాథుఁడే కాఁదగునని నేనూహింతును. సోమనాథారాధ్యులని యాంధ్ర వీరశైవ కవులును, సోమేశ్వరుఁ డని కర్ణాటక కవులును పేర్కొనిరి." "అన్నమయ్య పేర్కొనిన దూదికొండ కర్నూలుమండలములో ప్రత్తికొండ తాలూకా యందు గలదు. కర్నూలుమండలమున ప్రసిద్ధశైవక్షేత్రమగు శ్రీశైలమున కవితాప్రాభవమును వెలయించిన సోమనాథుఁ డామండలమున కొంతకాలము సంచరించిన నైతిహ్యము గలదు.[1]

యథావాక్కుల అన్నమయ్యగారు ప్రస్తుతించిన దూదికొండ సోమనారాధ్యుఁడు పాల్కురికి సోమనాథుఁడు కాజాలఁడు. ౧. పాల్కురికి సోమనాథుఁడు జన్మముచే బ్రాహ్మణుఁడైనను బ్రాహ్మణ్యమును ద్యజించి జంగ మాయెను. ఈ కారణముచేతనే సోమపతితుఁడని బ్రాహ్మణు లతని దూలనాడిరి. ఆరాధ్యులు లింగధారులైనను బ్రాహ్మణ్యమును విడనాడలేదు.

---

1. Lives of Telugu Poets pp. 349, 374, 375.

కావున పాల్కురికి సోము నారాధ్యుఁ డనుట తగదు. వేంకట రావుగారు వచించిన శివకవు లెవ్వరో తెలియదు. ౨. ఇంతకంటె ముఖ్యమైనది యథావాక్కుల అన్నమయ్యగారి గురువు యింటిపేరు. అతడు దూదికొండ సోమనారాధ్యుఁడు. పాల్కురికి దూదికొండగ నెట్లు మారగలదు ? కర్నూలు మండలమున గొంతకాలము సంచరించుటవలన మారినదని వెంకట్రావుగారు చెప్పుచున్నారు. కర్నూలుమండలమున సోమ నాథుఁడు గొంతకాలము సంచరించెనని తెల్పు నైతిహ్యము లెప్పటివి ? వెంకట్రావుగారి నాయనగారు, పసుపుల నాగయ యోగిగారు పెండ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రులగారికంటె బూర్వి కుల కెవ్వరికి నీదైయైతిహ్యము దెలియనట్లున్నది. ఒకవేళ వీరు చెప్పునట్లు పాల్కురికి సోమనాథుఁడు కొంతకాలము కర్నూలు మండలమున సంచరించినది వాస్తవమే యనుకొన్నను దత్కా రణమున నాతఁడింటిపేరు మార్చుకొనెననుట విశ్వసనీయము గాదు. తాము నిర్ణయించిన పాల్కురికి సోమనాథుని కాలము సరియైనదని నిరూపించుటకొఱకు వేంకట్రావుగారీ వ్యక్త్యై కీకరణమును గావించినట్లున్నది. దీనిని బలపఱచు సాక్ష్య మెద్దియు లేదు. అట్టి సాక్ష్యమును వారు జూపువఱకును దూదికొండ సోమనారాధ్యుడును బాల్కురికి సోమనయు భిన్నపురుషులనియే తలంచుట సమంజసము.

౮. ఇతరులు:—సోమనాథుని గ్రంథములలో పేర్కొన బడిన యతని సమకాలికులనుగూర్చి మనకేమియు దెలియదు; కాని యిటీవలి శాసనపరిశోధనవలన వారిలో నిద్దఱి విషయము గొంత తెలియవచ్చుచున్నది. ఈ యిరువురిలో నొక్కఁడు

రెంటాల మల్లినాథుఁడు. ఇతని సంగతిని సోమనాథుఁ డిట్లు వర్ణించియున్నాఁడు:—

"శీలంబు దనర సీమాలంఘన వ్ర
తాలంకృతిని బేర్చి యాచారలీల
యసలారఁగాఁ గుమారాద్రికిఁ దూర్పు
దెసను సోపానముల్ దీర్చి వాల్పార
మహిత సద్భక్తి సముంచిత వృత్తి
మహిఁజను రెంటాల మల్లినాథుండు."

రెండవది దోచమాంబ:— ఈమె మహిమ నిట్లు వర్ణించినాఁడు:

"నిరతిశయ ప్రీతినిత్యంబునైదు
కరవీర పుష్పముల్ హరునకర్పింప
నొక్కనాఁడొకడందు దక్కువయైన
గ్రక్కున దననేత్ర కమల మర్పించి
భవునిచే నసదృశాంబకముప్డ పడసి
ధృవకీర్తి బేర్కొన్న దోచ మాంబయును."[1]

ఈ రెండంశములును శకవర్షము ౧౨౧౨ అనగా క్రీ.శ. ౧౨౯౦-౯౧ నాడు వ్రాయించిన అంబదేవుని నీలగంగవరశాసనమున బ్రస్తావింపబడియున్నవి. ఈ శాసనముయొక్క ప్రాముఖ్యమును మొదట గుర్తించినవారు శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు. తారణవర్ష మాఘమాస భారతిలో నీ శాసనములోని విషయములను జర్చించుచు "పాలకురికి సోమనాథుని కాలము" అను శీర్షిక క్రింద నొక వ్యాసమును బ్రకటించిరి.

1. బసవపురాణము. ఆ. ౧. పుట. 3.

కాకతీయులకు సామంతులై పానుగల్లు మొదలు మూర్జవాడి వఱకుగల దక్షిణసీమను పాలించిన కాయస్థరాజులలో నొక్కఁడగు నంబదేవుఁడు శకవర్షము ౧౨౧౨ కు సరియైన వికృతి భాద్రపద బహుళ అమావాస్యనాడు శ్రీత్రిపురాంతకక్షేత్ర వాసియగు మాహేశ్వరుఁడైన రెంద్రేవుల మల్లినాథయంగారికి మొల్లకల్లూరి గ్రామమును సర్వబాధాపరిహారము ఆచంద్రార్క స్థాయిగాను శివపురముగ నిచ్చెనని యీ శాసనము ప్రకటించుచున్నది. ఈ శివపుర ప్రతిగ్రహీతయగు రెంద్రేవుల మల్లినాథుఁడే బసవపురాణమున బాలకురికి సోమనాథుఁడభివర్ణించిన రెంటాల మల్లినాథుఁడని సోమశేఖరశర్మగారు గుర్తించినారు. తాము చేసిన వ్యక్త్యైకీకరణము సరియని రుజువుసేయుటకు పై శాసనము చివరనున్న,

"దేవీ యస్య స్వకీయా త్రిపుర విజయినే
చతురుత్పాట్య పూజాం
కృత్వా రేజే తతోపిద్ధ (హ్య) [ని*]
తరమమలం దోచయాఖ్యా ప్రసిద్ధా
పూర్వద్వారే కుమారక్షితి
భృదుపరి తస్తత్పురారే పురస్తా
ద్రమ్యం సోపానమార్గం [సుఖ?]
కరమమలం ద్యప్రతిజ్ఞాం విధాయ."

అను శ్లోకము నుదాహరించి, యందు కుమారగిరి పూర్వద్వార సోపాననిర్మాణ ప్రస్తావమున్నను, "రెంటాల మల్లినాథుని పేరుగాని, రెంద్రేవుల మల్లినాథుని పేరుగాని శ్లోకమున లేదు.... తన కన్ను ఊడబెఱికి త్రిపురవిజయికి (త్రిపురాంతకునికి) పూజ

చేసి ప్రసిద్ధిగన్న దోచమాంకితమాత్రము ఉదాహరింపబడినది. శాసనశ్లోకమున బ్రశంసింపబడిన దోచయాఖ్య పాల్కురికి సోమనాథుఁడు తన బసవపురాణమున వర్ణించిన దోచమాంబయే యనుటకు సంశయింపనక్కరలేదు. కుమారాద్రికి తూర్పు ద్వారమున త్రిపురాంతకేశ్వరునిముందు సోపానములు కట్టించిన వాఁడును మల్లినాథయంగారే—రెంద్రేవులవారని శాసనము దెలుపుచుండఁగా, రెంటాలవారని పాల్కురికి సోమనాథుని బసవపురాణ మెఱిగించుచున్నది. ... రెంటాలపదము ప్రాచీన రూపము రెంద్రేవుల" యని వివరించినారు. మఱియు 'బాలకురికి సోమనాథుని సమకాలికుఁడగు రెంటాల మల్లినాథుఁడు క్రీ. శ. ౧౨౯౦ లో నుండినట్లు శాసనమునుబట్టి విస్పష్టమగుచున్నందున పాలకుఱికి సోమనాథుఁడును అప్పటివాఁడే యనుటకు అభ్యంతరముండదు......' "ఎట్లయినను, బసవపురాణ, పండితారాధ్యచరిత్రములు క్రీ. శ. ౧౨౯౦ కిని క్రీ. శ. ౧౩౨౦ కిని నడిమికాలమున బుట్టినగ్రంథములు" అని తీర్మానించినారు.[1]

పై పేర్కొనిన అంబదేవుని శాసనమును దాని నాధార పఱచుకొని సోమశేఖరశర్మగారు చేసిన పాలకురికి సోమనాథుని కాలనిర్ణయమును పరపక్షులవాదమునకు గుద్దాల ప్రాయమైనది. కావున సోమశేఖర శర్మగారి సిద్ధాంతమును బూర్వపక్షము జేసి తాము నిర్ధారించిన కాలమె సరియైనదని నిరూపించుటకు వారు దృఢప్రయత్నములు సల్పుట సహజమె. శర్మగారు చేసిన కాలనిర్ణయము సరికాదని వాదించు వారలలో బ్రము

1. భారతి, సం. ౨౨, పుటలు. ౧౦౭-౧౦౮ అ.

ఖులు శ్రీ బండారు తమ్మయ్యగారు. సంగ్రహముగ వీరి వాదము యొక్క సారాంశము నిట్లు చెప్పవచ్చును.

౧. శకాబ్దము ౧౨౧౨ (క్రీ. శ. ౧౨౯౦) లో నంబదేవునిచే మొల్లకల్లూరు గ్రామమును శివపురముగ బడసిన రెండ్రేవుల మల్లినాథుఁడు బసవ పురాణావతారికలో బాలకురికి సోమనాథునిచే పేర్కొనఁబడిన రెంటాల మల్లినాథుఁడు గాఁడు.

౨. శాసనమున బసవపురాణ పీఠికయందువలె ద్రిపురాంత సోపాన నిర్మాణప్రస్తావమున్నను, బసవపురాణమునందున్నట్లు తన్నిర్మాత రెంటాల మల్లినాథుడని చెప్పక దోచయాఖ్యయని చెప్పుటవలన నది బసవపురాణోక్తసోపాన నిర్మాణమునకంటె భిన్నమైనది.

3. శాసనమున వర్ణింపబడియుండు దోచమాంబామహిమాదికములు శాసనకాలమున కనఁగా క్రీ. శ. ౧౨౯౦ వ సంవత్సరమునకు మును పెప్పుడో జరిగినవి, కావున దోచమాంబకు సమకాలికుఁడైన పాలకురికి సోమనాథుఁడు గూడ తత్పూర్వుఁడే కావలయును. ఈ కారణములవలన పాల్కురికి సోమనాథుఁడు సోమశేఖర శర్మగారు వాదించునట్లు క్రీ. శ. ౧3 వ శతాబ్దము చివరను ౧౪ వ శతాబ్ద ప్రారంభమునను నుండెనని తలంచుటకు వీలుగాదు. తమ్మయ్యగారి విమర్శ కొంత మట్టుకు సంగతమైనదే; కాని వారి తీర్మానములంగీకార్యములు గావు. [1]

తమ్మయ్యగారి వాదమును బరామర్శించుటకు ముందీ చర్చలకు గురియైన యంబదేవుని శాసనమును గూర్చి చెప్పదగిన

1. భారతి, సం. ౨౨. పుటలు ౧౧3—౧౭.

విషయము గొంత కలదు. శాసనశిల తునిసినది, అక్షరములు చెక్కు తావులందు మాసిపోవుటయె గాక శాసనగ్రంథము సంపూర్ణముగాదు. లభించిన శాసనగ్రంథము మూడు భాగములుగ విభక్తమగుచున్నది. (౧) మొదటినుండి ౫౧ వ పంక్తి కొస వఱకును ప్రథమభాగము. ఇందలి భాషసంస్కృతము. శాసన దాతయైన యంబదేవుని వంశాదికమును నతఁడు రెండ్రేవులమల్లినాథునికి శకాబ్దము ౧౨౧౨ వికృతి భాద్రపద బ. ౧౫ ద్వాదశార్ధోపరాగ సమయమునజేసిన మొల్లకల్లూరు శివపుర దానమును వివరింపబడినది. (౨) పంక్తులు ౫౧-౬౦ ఇందలి భాష తెలుగు. ప్రథమ భాగమునందుక్తమైన దాన విషయమే సంగ్రహముగ నిందు వివరింపఁబడినది. (3) పంక్తులు ౬౦-౬౬. భాష సంస్కృతము. ఇందు ఒక్కటే స్రగ్ధరావృత్తము గలదు. పై రెండు భాగములతో దీనికిగల సంబంధ మెట్టిదియో విదితమగుటలేదు. రెండవభాగము క్రింద దానికి జేరినట్లు చెక్కబడియుండుటచే పై రెండు భాగములు చెక్కఁబడిన పిదప గొంత కాలమున కిది చెక్కబడినదనియు బైవానితో దీనికెద్దియో యనిర్వచనీయమైన సంబంధము గలదనియు దోచుచున్నది. లేఖక శిల్పుల యజాగ్రత్తవలన శాసనగ్రంథమున దప్పులు దొరలినవి. గాలివాన యెండల సోకుఁడువలన శాసన శిలాతలము గొన్నియెడల పేలెత్తిపోయినది; మఱికొన్నియెడల నక్షరములు మాసిపోయినవి; కాని యందలి భావము స్పష్టమగుచునే యున్నది; దాని సారాంశమిది:—శివుని దన కంటి నూడబెఱికి యర్పించి యా దేవుని ప్రసాదమువలన మరల నేత్రమును బడసినదియు, కుమారాద్రికి దూరుపువైపు సోపానములను నిర్మించి ప్రఖ్యాతి నందినదియునగు దోచ యాఖ్య

యెవ్వరిదేవి యో' యని దోచయాఖ్య భర్త ప్రస్తావముతో నీ స్రగ్ధర సమాప్త మగుచున్నది. ఇందువలన శాసనగ్రంథ మసంపూర్ణమని తెల్లమగుచున్నది. శ్లోకములోని 'యస్య'కు దానిలో జవాబులేదు. అందలి 'యస్య'తో పాటు 'తస్య యజ్ఞదత్తస్య' యుండినగాని శ్లోకమందలి భావము సంపూర్తి కాదు. కావున నీ స్రగ్ధరకు దరువాత దోచమ భర్తయొక్క నామాదులను వివరించు శ్లోకమొక్కటియేనియు నుండవలయును. శాసన శిలపై నట్టిదెద్దియు గానరాకపోవుటచే శాసన గ్రంథ మసంపూర్ణ మనుట స్పష్టము.

ఇక తమ్మయ్యగారి వాదమును బరామర్శింతము. మొదట విచారింపదగినది రెంద్రేవుల, రెంటాల మల్లినాథుల వ్యక్త్యైక్య సమస్య. సోమశేఖరశర్మగారు చెప్పినట్లు శాసన ప్రతిగృహీత యగు రెంద్రేవుల మల్లినాథుఁడు బసవపురాణావతారిక యందు పేర్కొనఁబడిన పాలకురికి సోమనాథుని సమకాలికుఁడగు రెంటాల మల్లినాథుఁడగునా? కాదని తమ్మయ్యగారు తీర్మానించియున్నారు గదా; కాని యీ మల్లినాథసమస్య దోచమ కథతో బెనగొనియున్నది; దోచమ వృత్తాంతమును విచారించక దాని బరిష్కారము సేయుటకు సాధ్యముగాదు; కావున మొట్టమొదట దోచమ వృత్తాంతము నారయుదము.

ఈ దోచమ యెవ్వరు? ఆమె భర్తపేరేమి? ఈ శాసన శిలపై వారి ప్రస్తావము రానేల? అను ప్రశ్నలు సమాధానమును గోరుచున్నవి? ఈ భార్యాభర్తల నానవాలు పట్టుటకు శ్రీ తమ్మయ్యగారు ప్రయత్నమొనర్చిరి. స్పష్టముగ దెల్పక పోయినను దోచమయు నామె భర్తయు బై శాసనముయొక్క దాతృ ప్రతిగృహీతలలో నొక్కరికి సంబంధించినవారై

యుండరని యభిప్రాయమును సూచించినారు. ఇది మిక్కిలియు సమంజసమైనది. ఏలనఁగా నట్టి సంబంధ మెద్దియేని లేనియెడల వారి యుదంతమును వర్ణించు భాగము పై శాసన గ్రంథముతో జేర్చినట్లు చెక్కబడియుండదు. ఆ దోచాంబ యంబదేవుని భార్యయగునా యని మొదట విచారించి కాదని నిశ్చయించినారు తమ్మయ్యగారు. ఇదియు నొప్పుకొనదగినదే. ఏలనఁగా నీ శాసనము నంబదేవుని వంశానుక్రమము వర్ణింపబడియున్నది. దోచమ యంబదేవుని భార్యయే యైయుండిన యెడల నామె విషయమూ వంశానుక్రమమునందు వివరింపబడి యుండును. అట్లుగాక శాసనాంతమందు వచ్చుటచే నామె కంబదేవునితో నెట్టి సంబంధమును లేదనియే తోచుచున్నది. దోచమ యంబదేవుని భార్యకాదని నిశ్చయించి రెండ్రేవుల మల్లినాథున కామెకు నెమేని సంబంధము గలదాయని విచారించుట కారంభించినారు. ఆమె యంబదేవునికి భార్యయగునా యని చర్చకు ప్రారంభించిన తమ్మయ్యగారు మల్లినాథుని కామె భార్యయా యను నంశమును ప్రస్తావమున కేలనో దేరైరి. ఒక్కపెట్టున నామె రెండ్రేవుల మల్లినాథుని పితామహియో మఱియొక్కతెయో కావచ్చుననియు జెప్పినారు.[1] పితామహియ కానేల? ప్రపితామహియో, తల్లియో, భార్యయో యేల కారాదు? ప్రపితామహియని కాని తల్లియని కాని భార్యయని కాని చెప్పిన దాము చేసిన పాలకురికి సోమనాథుని కాల నిర్ణయమునకు బ్రతిరోధము కలుగును. దోచమ రెండ్రేవుల మల్లినాథునికి బ్రపితామహియైన సోమనాథునికి బూర్వికురాలగును; తల్లిగాని, భార్యగానియైన నామె కాలము క్రీ. శ.

1. భారతి, సం. ౨౨, పుటలు ౧౧౬-౧౧౭.

౧3 వ శతాబ్దపు టుత్తరార్ధమగును. రెండును దమ్మయ్యగారి కాలనిర్ణయమునకు వ్యతిరేకించును. కావున తమ సిద్ధాంతమున కనుకూలపడునట్లు పితామహి యను వావిని గల్పించినారు. దోచమ రెండ్రేవుల మల్లినాథుని భార్యయనియె నా దృఢ విశ్వాసము. అగునేని ఆమె ప్రస్తావముపై శాసన ప్రథమ ద్వితీయ భాగములలో లేక దానితో బ్రత్యక్ష సంబంధములేని మూడవభాగమున రానేల? అంతటి మహిమాన్వితురాలి భర్త తన భార్యను గొప్పతనము నందె చెప్పకొనియుండఁడా? అను ప్రశ్నలు బయలువెడల వచ్చును. వీనికి సమాధానము రెండు విధముల జెప్పవచ్చును. శాసన కాలమప్పటి కింకను దోచమ మహిమాదికములు బ్రకటితమైయుండక పోవచ్చును. తత్కారణమున శాసనగ్రంథకర్త మొదటి రెండు భాగముల నామెను జేర్కొనకపోవచ్చును. తరువాత నామె వంశీకు లామె మహిమను బ్రకటించు నుద్దేశముతో నీతృతీయ భాగమును వ్రాయించి యామె భర్తగారి పేర నంబదేవుఁడు వ్రాయించి యిచ్చిన మొల్లకల్లూరు శివపురదానశాసనము క్రింద దీని జెక్కించియుండవచ్చును. దాన శాసనములలో బ్రతిగృహీతలనుగూర్చియు వారి పితృపితామహులనుగూర్చియు నెవ్వియేనియు జెప్పదగిన విశేషాంశములుండిన చెప్పట సామాన్యము, కాని వారి భార్యామాతృపితామహ్యాదులను బ్రశంసించుట యాచారముగాదు; కావున రెండ్రేవుల వారి సంతతి వారెవ్వరో తమ పెద్దల కీర్తినుగ్గడించుచు గొన్ని శ్లోకములను వ్రాయించి పై శాసనము క్రింద జెక్కించియుండవచ్చును. ఈ సందర్భమున జెప్పఁదగిన విషయ మింకొకటి గలదు. మొల్ల కల్లూరు శివపురదానశాసన రచనతోగాని ప్రతిష్ఠతోగాని

రెండ్రేవుల మల్లినాథునికి సంబంధము లేదు. దాన శాసనమును రచించిన వారంబదేవుని సంస్థాన సంప్రతులు, స్థాపించిన వారాతని కొలువునందలి యుద్యోగులు. రెండ్రేవుల వారి ఘనతను బొగడుట వారియుద్దేశము గాదు, దేశపాలనయందు పనివడి యుండు నుద్యోగుల యుపయోగార్థమై శాసనము బ్రకటింపఁబడెను. మొల్లకల్లూరు శివపుర దానశాసనమున దోచమను గూర్చి చెప్పిన విశేషాంశములు రెండు. ౧. తనకంటి నూడ బెఱికి శివునర్పించి యాతని ప్రసాదమువలన మరల కంటినిబడసెను. ౨. కుమారత్రిభృత్పూర్వపార్శ్వమున సోపానములను నిర్మించినది. కంటినూడ బెఱికి శివునకర్పించి మరల దాని బొందిన దోచమ పాలకురికి సోమనాథుని సమకాలికురాలొక్కతె కలదు. ఆమెను సోమనాథుఁడిట్లు వర్ణించియున్నాఁడు.—

"నిరతిశయప్రీతి నిత్యంబునైదు
కరవీర పుష్పముల్ హరునకర్పింప
నొక్కనాడొకడందు తక్కువయైన
గ్రక్కున దననేత్రకమలమర్పించి
భవునిచే నసదృశాంబకమప్పడసి
ధుగ్వికీర్తి జేకొన్న దోచమాంబయును."

ఈ దోచమయు బైశాసనమున గీర్తింపఁబడిన దోచమయు నొక్కతె యానని సోమశేఖరశర్మగారు గుర్తించిరి; కాని తమ్మయ గారందులకీయకొనలేదు. "దోచయాఖ్యాదేవి నేత్రకమల సమర్పణ విషయమున గూడ శాసన శ్లోకమందలి సంగతులకు బసవపురాణమునజెప్పిన సంగతులకు సంపూర్ణైక్యము గానరాదు. దోచమాంబ త్రిపురాంతకక్షేత్రవాసియనికాని యామె

కన్నుల నర్పించి మరల బడసినది త్రిపురాంతకదేవుని వలననని కాని సోమనాథుఁడు చెప్పలేదు. శివునకు నిత్యమైదు కరవీర పుష్పములనర్పించు వ్రతముగల యామెకు వ్రత పరీక్షణమున జరిగిన విషయమే యాతండు పేర్కొనినాడు. కాని నిత్య కరవీర పుష్పపంచకార్చన ప్రశంస శ్లోకమున లేనేలేదు. కావున సోమనాథుఁడు పేర్కొనిన దోచమాంబయు శాసనమున పేర్కొనబడిన దోచయదేవియు నేక వ్యక్తియేయని చెప్పుటకు గూడ నవకాశములేదు." అని వక్కాణించినారు.[1] బాపురే! స్తనశల్య పరీక్షయన్న నిట్టుకదా యుండవలయును. కాని తమ్మయ్యగారు చూపిన భేదము లల్పములు, పరిగణింప దగినవి కావు. పై జెప్పిన బసవపురాణోక్త శాసనోక్త దోచాంబా వృత్తాంతములు రెంటికిని సామాన్యమైనవి ముఖ్యాంశములు రెండు గలవు. అందు "దోచ" నామమొక్కటి, నేత్రము నూడబెఱికి శివునకర్పించి తత్ప్రసాదమున నేత్రమును మరల బడయుట రెండవది. ఈ రెండంశములును జాలును ఇరువురు దోంచమాంబల వ్యక్త్యైకతను సుస్థిరముగ స్థాపించుటకు; శివునికి నేత్రమర్పించి దాని మరల పడసిన దోచమనామాంకితయగు భక్తురాలిని మఱియొక్కతెను తమ్మయ్యగారు చూపగలరా? అట్టి భక్తురాలినింకొక్కతెను దమ్మయ్యగారు వెలువరించునందాక సోమశేఖర శర్మగారుచేసిన వ్యక్త్యైకీకరణమె సరియని దృఢముగ బల్కవచ్చును. ఇఁక పై మొల్లకల్లూరు దానశాసన శ్లోకమున నామె విషయమై చెప్పిన రెండవయంశమును బరికింతము:—

"............అమలందోచయాఖ్యా ప్రసిద్ధం
పూర్వద్వారేకుమారత్రితి భృదుపరిత స్తత్పురారేః పురస్తా

1. భారతి. సం. ౨౨. పుట. ౧౧౮.

ద్రమ్యాం సోపానమార్గం.............విధాయ"
యని యున్నది. ఇందువలన దోచమ కుమారగిరికి అనఁగా త్రిపు
రాంతకమునకు దూర్పుతట్టు నిజనామాంకితమైన సోపానమార్గ
మును నిర్మించెనని తెలియవచ్చుచున్నది. తమ్మయ్యగారు లేలనో
"పూర్వద్వారే" యనుమాటలను జల్లగ జాఱవిడిచినారు.
"దోచయ దేవిని గురించిన శ్లోకములో నే యామె నయనార్పణ
పునరాదానమహిమతో పాటు కుమారాద్రిపయిని ద్రిపురాం
తకదేవుని యెదుట నామె నిర్మింపఁజేసిన సోపానప్రశంసగూడ
జేర్కొనబడియున్నది[1] అని వ్రాసినారు.

త్రిపురాంతక పూర్వద్వార సోపాన నిర్మాణ ప్రస్తావము
బసవపురాణమునందును గలదు.

"అసలారఁగాఁగుమారాద్రికి తూర్పు
దెసను సోపానముల్ దీర్చి పొల్పార
మహిత సద్భక్తి సముచితవృత్తి
మహిఁజను రెంటాలమల్లినాథుఁడును"

అని సోమనాథుఁడు వ్రాసియున్నాఁడు. దోచమ మహిమాదికము
లను జెప్పియు ద్రిపురాంతక పూర్వద్వార సోపాన నిర్మాణకర్త
దోచమయనక రెంటాలమల్లినాథుడని సోమనాథుఁడు చెప్పుట
జూడ నందేదో విశేషము నిగూఢమైయున్నదని తోచు
చున్నది. ఈ సందర్భమున జింతనసేయఁదగిన విషయములు
గొన్ని కలవు. సుప్రసిద్ధ శైవక్షేత్రమైన శ్రీశైలమునకు వలె
కుమారాద్రికి సోపానములు గట్టించిన వారు పెక్కురుగాన
రారు. వాఙ్మయమున రెంటాలమల్లినాథుఁడును శాసనములలో
దోచమయుదప్ప నీ పుణ్యకార్యమును గ్రహించినవారు

1. భారతి. సం. ౨౨. పుట. ౧౧౫.

మఱెవ్వరును లేరు. రెంటాల మల్లినాథుఁడును దోచమయు సమకాలికులు. వారిద్దరును సోపాన నిర్మాణమును గావించినదియు గుమారగిరి పూర్వపార్శ్వముననే. సమకాలికులగు వీరిర్వురును ప్రత్యేకముగ వెవ్వేఱు సోపానపంక్తులను నిర్మించిరనుట విశ్వాసార్హముగాదు; మఱియునట్టి ప్రత్యేక సోపానాళి నిర్మాణావశ్యకతయు గానరాదు, కావున రెంటాలమల్లినాథుఁడును దోచమయు గట్టించిన సోపానపంక్తి యొక్కటియే యని తలంచుట యుక్తము.

అయిన నీసోపాన నిర్మాణమును బసవపురాణమున రెంటాల మల్లినాథునకును మొల్లకల్లూరు గ్రామశాసనమున దోచమకును నారోపించుటకు గారణమేమి? వార భార్యాభర్తలగుటయే దానికి గారణము. దోచమ రెంటాల మల్లినాథుని భార్య. ఆమె ప్రోత్సాహము మీఁదనె యతఁడు సోపాన నిర్మాణమును గావించినది. ధనమును వెచ్చపెట్టి నిర్మాణకార్యము కొనసాగించినాతఁడు మల్లినాథుఁడగుటవలన సోమనాథుఁడతఁడే సోపాన నిర్మాతయని చెప్పినాడు. శాసన గ్రంథకర్తయన్ననో యాయుద్యమమును దలపెట్టి భర్తను ప్రోత్సాహము జేసి యతనిచే నా కార్యమును బూర్తిచేయించిన దోచమయె తన్నిర్మాణమునకు వాస్తవముగ గారణభూతురాలని తలంచి యామెకె దాని కర్తృత్వము నంటగట్టినాఁడు. బసవపురాణ మొల్లకల్లూరు దాన శాసనసాక్ష్యముల వ్యత్యాసమునకిదియె కారణము. భర్త చేసిననేమి భార్య యతచే జేయించిననేమి? ఆ పుణ్యకార్యమున వారిరువురును భాగస్వాములు గాకపోవుదురా?

శాసనగ్రంథమందలి దోచమవృత్తాంతమును జర్చించునప్పుడామె రెండ్రేవుల మల్లినాథుని పత్ని కావచ్చునని

యూహించితిని. ఇచట నామె రెంటాల మల్లినాథుని సతియని వాక్రుచ్చితిని. వీరిద్దరికిని నామె యెట్లు భార్య కాగలదు? అని యెవ్వరైన నడుగవచ్చును. ఇందు వైపరీత్యమేమియు లేదు. రెంద్రేవుల రెంటాలయొక్క పూర్వనామ మనియు రెంద్రేవుల మల్లినాథుఁడు రెంటాల మల్లినాథుఁడేయనియు సోమశేఖర శర్మ గారు గుర్తించి యున్నారు. తమ్మయ్యగారికిది నచ్చలేదు. "రెంద్రేవుల యనురూపమె క్రమముగ రెంద్రేల, రెండేల, రెండాల, రెంటాల యను పరిణామము జెందియుండునని వారి (సోమశేఖరశర్మగారి) తలంపు. ఈ సమర్థనము కేవలమసంగతమని చెప్పనక్కఱలేదు. ఆ గ్రామమాపేరితో గుంటూరుజిల్లా పల్నాడుతాలూకాలో నిప్పటికిగూడ నున్నది. ఇంతకు ఛందోబద్ధమైన సోమనాథుని బసవపురాణములో యింటి పేరు స్పష్టముగ "రెంటాల" అని చెప్పఁబడియుండఁగా నిట్టివాదమున కవకాశమే లేదు... కావున శాసనమందలి దానప్రతిగ్రహీత రెంద్రేవుల మల్లినాథుఁడు, సోమనాథుని మిత్త్రుఁడు రెంటాల మల్లినాథుఁడు నేక వ్యక్తియే యనుట సంగతముగాదు" అని వక్కాణించినారు.[1] తమ్మయ్యగారు తలచినట్లు ప్రాచీన స్థల నామములు మారి నూతనరూపముల బొందుట యసంగతము గాదు. ఇట్టిమార్పుల కెన్నియేనియు నుదాహరణముల జూపవచ్చును. దేహాలి ఢిల్లియైనట్లును, విజయవాడ బెజవాడయైనట్లును, ధరణికోట దన్నడ, లేక దన్నాడ యైనట్లును, పాగుణవరము పానారమైనట్లును, కాకందినాడు కాకినాడ యైనట్లును రాజమహేంద్రపురము రాజమండ్రి యైనట్లును రెంద్రేవుల రెంటాల యై మారియుండవచ్చును. "రెంటాల" యని బసవ

1. భారతి.సం. ౨౨, పుట, ౧౮౫.

పురాణమున ఛందోబద్ధమైనంత మాత్రమున నది "రెండ్రేవుల" కంటె భిన్న ప్రదేశముగావలసిన యావశ్యకత లేదు. బసవ పురాణ రచనాకాలమున 'రెంటూల' లోకవ్యవహారమునందు వాడుకయందున్నను, రెండ్రేవుల సంపూర్ణముగ నంతరించి పోలేదు. వంశాచారముననుసరించి మల్లినాథుఁడును నతని సంతతివారును దాము రెండ్రేవుల వారని చెప్పుకొనుచు వచ్చినను, రెంటూల వారని లోక వ్యవహారమున బ్రసిద్ధి కలిగినది. పాలకురికి సోమనాథుఁడు వ్యవహారభాష యందభిమానము గలవాఁడగుటచేత దన కాలమున జనానీకమున వాడుకయం దుండిన మాటలను బెక్కింటిని దన గ్రంథములలోని కెక్కించి యున్నాఁడు. కావున లోకమర్యాద ననుసరించి రేండ్రేవుల మల్లినాథుని రెంటూల మల్లినాథుఁడని చెప్పియుండవచ్చును. అంత మాత్రమున రేండ్రేవుల మల్లినాథుఁడును రెంటూలమల్లినాథుఁడును భిన్నవ్యక్తులని వాదించుట సరి కాదు.

ఈదీర్ఘచర్చ ఇంతటితో సమాప్తమైనది. పాలకురికి సోమనాథుఁడు క్రీ. శ. ౧౨ వ శతాబ్దాపరార్ధమునను ౧౩ వ శతాబ్ద పూర్వార్ధమునను వర్ధిల్లెనను వారి సిద్ధాంతమును నిలబెట్టదగిన సాక్ష్యమేద్దియు గానరాదు. వారు విశ్వాసపాత్రమైన పిడుపర్తి సోమనాథుని సాక్ష్యమును విసర్జించి కర్ణాటక వ్యామోహమున దగుల్కొని నరసింహాచార్యులవారి యుప సిద్ధాంతముల చుట్టునొక సాలీని గూటిని నిర్మించుకొనిరి. చిరకాలము వారి కూఁతగోలఁగాయియుండిన సోమరాజునకు బ్రాపుగ విశ్వారాధ్యుని బ్రవేశపెట్టిరి. కాని వీరనుకొనినట్లు సోమరాజ విశ్వారాధ్యులు క్రీ. శ. ౧౩ వ శతాబ్దమువారు గాక తర్వాతి వారగుటవలన వీరి సిద్ధాంతము నిరాధారమై నిలువ జాలక కూలబడినది. శాసన

వాఙ్మయ పరిశోధనలవలన సోమరాజు ౧౬ వ శతాబ్దమువాడనియు విశ్వారాధ్యుఁడు ౧౫ వ శతాబ్దమువాడనియు దేలినది. వారు ౧౪ వ శతాబ్దపూర్వార్ధమున వెలసిన పాలకురికి సోమనాథుని బ్రశంసించుట యొక విశేషముగాదు; తక్కిన యాధారములలో ముఖ్యమైనవి సోమనాథుని బసవపురాణ, పండితారాధ్య చరిత్రలు; కర్ణాటకై లాటమున జిక్కి యాంధ్ర వాఙ్మయ విమర్శకులందు జెప్పియుండు చరిత్రాంశములను జక్కఁగ గ్రహింప జాలరైరి; కావున వారి పరిశోధనలు వమ్మగుట వింతకాదు. సోమనాథుని గ్రంథములకు దరువాత పిడుపర్తి సోమనాథుని పద్య బసవపురాణము ముఖ్యమైనది. అందు వర్ణింపబడియుండు పాలకురికి సోమనాథుని వృత్తాంతము విశ్వాస పాత్రమైనది. ఇది యైతిహ్యమే, ఐనను కడు ప్రాచీనమైనది; పాలకురికి సోమనాథుని మరణానంతరము సుమారు నూటయేబది సంవత్సరములనుండియు బ్రచారములోనున్నది. మఱియునందుక్తమైన చరిత్రాంశములన్నియు సత్యాత్మకములని సమకాలిక చరిత్రగ్రంథములవల్లను శాసనాదులవల్లను రుజువగుచున్నది; విశ్వాస పాత్రముగాదని నిరూపింపదగిన సాక్ష్యము లేదు. కావున పాలకురికి సోమనాథుఁడు రుద్రాంబ దౌహిత్రుఁడును నామె యనంతరము సింహాసనము నధిష్ఠించి క్రీ. శ. ౧౨౯౧ మొదలు ౧౩౨౩ పర్యంతము గాకతీయ సామ్రాజ్యమును బాలించిన ప్రతాపరుద్రుని కాలమునను నటుపిమ్మట మఱి కొంత కాలమును జీవించియుండెనని దృఢముగ జెప్పవచ్చును. అతఁడు సుమారు క్రీ. శ. ౧౨౮౦ నుండి ౧౩౪౦ వఱకును జీవించెనని యనుకొనవచ్చును.

---

# అనుబంధము

## అర్జునవాడ శాసనము

బసవన్న కాలనిర్ణయ సందర్భమున పరామర్శింప దగినది శకాబ్దము ౧౧౮౨ సిద్ధార్థి చైత్ర బహుళ అమావాస్య సోమ వారమున సూర్యగ్రహణపుణ్యకాలసమయమున దేవగిరి యాదవవంశజుడైన కన్నర దేవుని సామంతులగు చావుణసెట్టి నాగరసులను వారు హాలబసవిదేవుడను వీరశైవ తపోధనునకు జేసిన భూదానమును దెల్పు నర్జునవాడ శిలాశాసనము. ఇందు సంగనబసవని మహిమయును దద్వంశజుండైన హాల బసవిదేవుని వంశానుక్రమమును నిట్లు వర్ణింపబడియున్నవి.

"మత్తంతార్దవాడి మధ్యగ్రామవాద బౌగవాడిపురవరా ధీశ్వరమాదిరాజనం తనూజం బసవరాజన మహిమయెంతెందడె"

మంగళకీర్తి పురాతన
జంగమ లింగైకభక్తి నిర్భరలీలా
సంగం సంగన బసవం
సంగతియంమాళ్కె భక్తియొళ్సుగనవరతం"

... ... ...

సంగన బసవన అగ్ర..........
......కం దేవరాజముని పనతనయం
జంగమపరుసం.........ర
సంగం ప్రియసుతనె నిప్పకలిదేవరసం"

కలిదేవమునిపనాత్మజ
సలెమూజగదొళగె మెఱెవ మానవదేవం

గెలిదం అసన బెసనవం
ఛలదధికం హాల బసవిదేవమునీశం" [1]

పై నుదాహరింపఁబడిన మూడు పద్యములలో రెండవ దానిని, శ్రీయన్. లక్ష్మీనారాయణరావు ఎం. ఏ. గారు

సంగన బసవన అగ్రజ, లింగైకం దేవరాజమునిపన తనయం
జంగమ పరుసం కావర,సంగం ప్రియసుత నెనిప్ప కలిదేవర సం"

అని సవరించి, "సంగన బసవనియన్న లింగైక్యమునందిన దేవ రాజమునిపుడు; అతని కొడుకును జంగమ చింతామణియును నైన కావరసునకు కలిదేవరసుడను ప్రియతనయు డుద్భవించె నని యర్థము జెప్పి ప్రతిగ్రహీత వంశము నిట్లు తీర్చినారు.




ఈ శాసనమునకు విలువ యందలి వంశానుక్రమణికవల్ల గలుగుచున్నది; ఏలనఁగా నది సంగన బసవన వర్ధిల్లిన కాలమును నిర్ణయించుటకును నా పేరిటి లింగాయత మహాసంస్కర్తతో నాతని వ్యక్త్యైకత్వమును స్థాపించుటకును దోడ్పడ గలదు. యాదవరాజు కన్నరుని మంత్రియగు చౌడిసెట్టియు నాతని

1. Ep. Indica, xxi, pp. 9-16.

మిత్రుఁడగు నాగరసును కవిళాసగ్రామమును శకాబ్దము ౧౧౮౭ (క్రీ. శ. ౧౨౬౦) సం.న హాల బసవిదేవుఁడను తపస్వికి దానము చేసిన ట్లీశాసనమున జెప్పియున్నది. ఇదియ హాలబసవి దేవునియంతిమ వర్షమని తలంచి యత డిరువదిరైదేండ్లు వర్ధిల్లె నని యనుకొనినయెడల అతనికాల మించుమించు క్రీ. శ. ౧౨౩౫-౧౨౬౦ అగుచున్నది. సంగన బసవనికిని హాలబసవి దేవునికిని రెండు పురుషాంతరము లెడముగలదని పై దెల్పి యున్నాడ గదా. ఒక్కొక్క పురుషాంతరమునకును సుమారు ౨౫ యేండ్లకాలము గడచియుండుననుకొనిన, సంగన బసవని కాలము ౧౧౬౦-౧౧౮౫ అని తేలుచున్నది. బసవరాజదేవర రగళె, బసవపురాణ చెన్నబసవపురాణములవలన సంగన బసవ నామాంతరుడును మహా మతసంస్కర్తయు బాగెవాడి మాది రాజ కుమారుడును నగు బసవఁడు క్రీ. శ, ౧౧౫౬- ౧౧౬౭ల మధ్య రాజ్యపరిపాలన మొనర్చిన కాలచుర్యబిజ్జలుని మంత్రి యని తెలియుచున్నది. కావున నర్జునవాడ శాసనమున సంస్తుతింపఁబడిన సంగన బసవడే యా పేరింటి లింగాయత మతప్రవక్త యగుట నిస్సంశయము.వీరశైవసమయ పునరుద్ధర్తయగు బసవడు బిజ్జలునకు సమకాలీనుఁడను నైతిహ్యము సత్యమని ఋజువుసేయు శాసనసాక్ష్య మిందు లభ్యమగుచున్నది.[1]

శ్రీ లక్ష్మీనారాయణరావుగారు చెప్పునట్లు పై శాసనోక్త సంగన బసవడే వీరశైవ మత సంస్కర్తయనుట కాధారము గలదు. (౧.) ఇరువురకును సంగన బసవనామము సామాన్యము. (౨.) వారిద్దరి తండ్రులును బాగెవాడి మాదిరాజనామాంకితులే. (3.) ఇద్దరును పురాతన లింగైక భక్తి నిర్భర లీలా

1. Ep. Ind. XXI, pp. 16-17.

సంగులే. ఈ కారణములవలన శాసనములోని సంగన బసవనయె లింగాయతమత ప్రవర్తయని తలంచుట సమంజసముగ కన్పట్టును; కాని దీనికి ప్రబలమైన యాక్షేప మొకటికలదు. బసవ పురాణోక్త కథ విశ్వాస పాత్రమైనచో లింగాయమత సంస్కర్తయగు బసవనికన్నయే లేడని దృఢముగ జెప్పవచ్చును. బసవన్న తల్లి యగు మాదాంబకు కొడుకులు లేకపోవుటవలన దుఃఖితురాలై యెన్నియో వెడనోములను నోమి ఫలము గలుగకపోవుటవలన చిట్టచివరకు నందికేశ్వరు నోము నోమి యతని ప్రసాదమువలన బసవన్నను గనెనని బసవపురాణ కథ:—

"అతని పరమ సాధ్వి యతివ మాదాంబ
సతత శివాచార సంపన్న ధన్య
కొత్తడినెల్లను కొండొక్క పెద్ద
యుత్తమురాలు ధర్మోపేతగాత్రి
యెల్లవారలకంటె మెల్లంబునందు
నల్లవోయను జీవనంబున బొదలి
కొడుకులు లేమికి గడు దుఃఖియగుచు
వెడనోములన్నియు వేసరనోమి
యాద్యులు పాత్తంబులందెల్ల వెదకి
హృద్యంబుగా నందికేశ్వరు నోము
కామార్థ సిద్ధికి గారణంబనుచు
సమ్యగ్రతస్థితిపరగ జెప్పుటయు

... ... ...

నిమ్ముల సోమవారమ్మాదిగాగ
దొమ్మిది దినములుత్సుకవృత్తినోచి

మఱునాడు సందిని సుజ్జనం బొర్చి
గుఱుతైన చందన కుసుమంబులిచ్చి
నాయన్న నాతండ్రి నాయాల జేడ
నీయట్టి సద్భక్తునీయట్టి పుత్త్రు
ఖ్యాతిగా నొక్కని గరుణించితేని
బ్రీతియొలర్ప నీ పేరిడుదాన"

నని మ్రొక్కుకొనెను. అంతట గర్భవతియై బసన్నను గనెను.[1] ఇందువలన మాదిరాజ మాదాంబలకు బసవన్నయే ప్రథమ పుత్త్రుడని తెల్లమగుచున్నది. ఇక నాతని కన్న గల్గుట యెట్లు పొసఁగును? ఈ ప్రశ్న కిట్లు సమాధాన మెవ్వరైన జెప్ప వచ్చును. "బసవన్న మాదాంబయొక్క జ్యేష్ఠ పుత్త్రుఁడనుటకు సందియము లేదు; మాదిరాజున కితర భార్యలుండి యుండఁ గూడదా. వారిలో నెవ్వరియందైన నతనికి బసవన్నకంటె బెద్ద వాడైన కొడుకు పుట్టియుండఁగూడదా. సాధ్యమే; కాని మాది రాజునకు మాదాంబగాక యితర భార్యలుండిరని తలంచుట కెట్టి యాధారమును లేదు. కావున అర్జునవాడ శాసనమందలి సంగన బసవన లింగాయతమత సంస్కర్తయే యని నిర్ధారించి చెప్పుటకు వలను పడదు. వాదమునకై యొకవేళ వారిరువురు నొక్కరేయని యొప్పుకొన్నను బిజ్జలునికి వారితో నెట్టి సంబంధ మున్నట్లగపడదు. సంగన బసవన బిజ్జలునకు సమకాలికుడగుట సాధ్యమైనను మంత్రియని చెప్పుటకీశాసనము దోడ్పడ జాలదు.

1. బసవ పురాణము, ఆశ్వా. ౧. పుటలు ౧౩ మొదలు.

చెన్నపురి : వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్‌వారి
వావిళ్ల ప్రెస్సున ముద్రితము—8-2-1955

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| తులసీదాసురామాయణము, వచనము, వ. శ్రీనివాసరావు ... | 12 | 0 |
| ద్వాదశోపనిషత్తులు, తెనుగువచనము ... | 5 | 0 |
| తిలకుగారి సెక్యూరిటీకేసు, ఉపన్యాసములు ... | 0 | 14 |
| భారతరమణీమణులు, ప్రథమభాగము, 21 స్త్రీరత్నములచరిత్ర | 1 | 4 |
| ,, రెండవభాగము 10 ,, ... | 0 | 10 |
| ,, మూడవభాగము 12 ,, ... | 0 | 8 |
| మజార్వేదకథాసంగ్రహము, 50 చిత్రకథలు, పార్నంది సర్వేశ్వరశాస్త్రి విరచితము ... | 0 | 8 |
| శ్రీమహాభక్తవిజయము, శ్రీ పాదసుబ్రహ్మణ్యశాస్త్రి ... | 12 | 0 |
| పంచతంత్రము, వచనము, సులభశైలి ... | 0 | 12 |
| పంచతంత్రహితోపదేశకథామంజరి, A. S. P. అయ్యర్ ... | 1 | 12 |
| నామహారాష్ట్రయాత్ర, జొన్నలగడ్డ సత్యనారాయణ ... | 4 | 0 |
| నేరములుచేయు జాతులచరిత్ర, ప్రతిమలతో ... | 1 | 0 |
| నేటికాలపుకవిత్వము, శ్రీ అక్కిరాజు ఉమాకాన్తముగారిది... | అచ్చు | |
| సంగ్రహరామాయణము, జ. శేషాద్రిశర్మ విరచితము ... | 1 | 8 |
| సంగ్రహభాగవతము, ,, ... | 2 | 8 |
| డిటో (సంగ్రహింపబడినది) విద్యార్థులకై ... | 1 | 0 |
| భోజకాళిదాసకథలు, I భాగము ... | 1 | 4 |
| II ,, ... | 1 | 4 |
| భోజునికథలు ... | 1 | 0 |
| సంస్కృతనాటకకథలు, సీతారామశాస్త్రిగారిది 1, 2 భాగములు | 2 | 0 |
| ,, ఖలుసు వేంకటరమణయ్యగారిది 3 వ భాగము ... | 2 | 0 |
| తెనాలిరామలింగనికథలు, జీవితము ... | 0 | 8 |
| ,, A. S. P. అయ్యరుగారిది ... | 0 | 8 |
| విక్రమార్కునికథలు ... | 0 | 12 |
| చాన్‌దర్వీషుకథలు ... | 1 | 0 |
| రాజశేఖరుడు, గోపాలుడు ... | 0 | 12 |

